# మిసిమి

***"All that we are is the product of what we have thought," is "We are what we think."*** **– Dammapada.**

సంపుటి 4 ఆగష్టు 1992 సంచిక 1

సంపాదకుడు: రవీంద్రనాథ్ ఆలపాటి

## విషయసూచిక



విడిప్రతి 4/- వార్షిక చందా రూ.50/-

ముఖ చిత్రకారుడు:
రాజా రవివర్మ

# LIVING DICTIONARY
## (DEVIL'S DICTIONARY)

*Compiled by*
AMBROSE BIERCE (1911)

**Compromise**, *n.* Such an adjustment of conflicting interests as gives each adversary the satisfaction of thinking he has got what he ought not to have, and is deprived of nothing except what was justly his due.

**Compulsion**, *n.* The eloquence of power.

**Condole**, *v.i.* To show that bereavement is a smaller evil than sympathy.

**Confidant, Confidante**, *n.* One entrusted by A with the secrets of B, confided by *him* to C.

**Congratulation**, *n.* The civility of envy.

**Congress**, *n.* A body of men who meet to repeal laws.

**Connoisseur**, *n.* A specialist who knows everything about something and nothing about anything else.

An old wine-bibber having been smashed in a railway collision, some wine was poured upon his lips to revive him. "Pauillac, 1873," he murmured and died.

**Conservative**, *n.* A statesman who is enamored of existing evils, as distinguished from the Liberal, who wishes to replace them with others.

**Consolation**, *n.* The knowledge that a better man is more unfortunate than yourself.

**Consul**, *n.* In American politics, a person who having failed to secure an office from the people is given one by the Administration on condition that he leave the country.

**Consult**, *v.t.* To seek another's approval of a course already decided on.

**Contempt**, *n.* The feeling of a prudent man for an enemy who is too formidable safely to be opposed.

**Controversy**, *n.* A battle in which spittle or ink replaces the injurious cannonball and the inconsiderate bayonet.

**Convent**, *n.* A place of retirement for women who wish for leisure to meditate upon the vice of idleness.

**Conversation**, *n.* A fair for the display of the minor mental commodities, each exhibitor being too intent upon the arrangement of his own wares to observe those of his neighbor.

**Coronation**, *n.* The ceremony of investing a sovereign with the outward and visible signs of his divine right to be blown skyhigh with a dynamite bomb.

**Corporal**, *n.* A man who occupies the lowest rung of the military ladder.

> Fiercely the battle raged and, sad to tell,
> Our corporal heroically fell!
> Fame from her height looked down upon the brawl
> And said: "He hadn't very far to fall."
>
> *Giacomo Smith.*

**Corporation**, *n.* An ingenious device for obtaining individual profit without individual responsibility.

**Corsair**, *n.* A politician of the seas.

# జన్ - బౌద్ధం

- డా॥ సంజీవదేవ్

మనిషికి మతం అవసరమా?

అవసరం కొందరికి, అవసరం లేదు మరికొందరికి.

మానవ జీవితంలోని ఏమి సాధించటానికి మానవుడు మతాన్ని సృష్టించాడో ఆమతమే తిరిగి ఆ సాధించబడేదానికి అడ్డం అవుతుందికూడా.

ఆదిమ మానవుడికి మతమే సంస్కృతి.

ఆధునిక మానవుడికి సంస్కృతియే మతం.

మతం చేయలేనిదాన్ని మనిషి చేయగలడు, మతాన్ని చేసిందికూడ మనిషియే కనుక.

మతాల్లోకల్లా మతం అనేది తక్కువ మోతాదులో ఉన్నది బౌద్ధం. బౌద్ధంలో అనేక విభాగాలున్నాయి. హీనయాన, మహాయాన, వజ్రయాన మొదలైనవి. తరువాత వచ్చినది జన్ బౌద్ధం అనేది.

జన్ బౌద్ధం మతంకాని మతం. దీనిలో మతం అనేదానికున్న లక్షణం ఒకటికూడా ఉండదు. ఇందులోనివన్నీ మతంలో ఉండని లక్షణాలే.

సంప్రదాయానికి కట్టుబడి ఉండదు జన్ బౌద్ధం. సిద్ధాంతాలకు, రాద్ధాంతాలకు, నీతులకు, నియమాలకు దూరంగా ఉంటుంది ఇది. జీవితం అంటే ఏ బంధనకూ లోబడి ఉండక సంపూర్ణ స్వేచ్ఛను కలిగి ఉండటం.

విశ్వాసం, దేవుళ్లూ, గుళ్లూ గోపురాలు, మంత్రాలు, తంత్రాలు, జపాలు, తపాలు, ఏవీకూడ మనిషికి సంపూర్ణ స్వేచ్ఛను ప్రసాదించలేవు అంటుంది జన్ బౌద్ధం.

సామాన్య మానవుడికి మించిన అసామాన్య అస్తిత్వం మరొకటి లేదని. జన్ దృష్టిలో బుద్ధుడు కూడా సామాన్యమానవుడే.

ఈ జగత్తులోని ఏ విషయాలు - భౌతిక, నైతిక, మానసిక - కూడ మనిషిని బందీ చేయరాదు. ప్రతిదానినుండీ అనంత స్వేచ్ఛలో జీవించాలి మనిషి.

శరీరానికి మనసు ఆటంకం కాకూడదు. మనసుకు శరీరం అడ్డు కాకూడదు. ఈరెండూ పరస్పరంగా స్వేచ్ఛను ప్రసాదించుకోవాలి. ఇటువంటి నిత్య జీవితంలోని తనకుకాని, ఇతర్లకు కాని హాని లేని స్వేచ్ఛయే నిర్వాణం, జీవన్ముక్తి.

మరణించిన తరువాయి నిర్వాణంకాదు, జీవించి ఉన్నప్పటి నిర్వాణమే కావలసింది.

జననానంతరం, మరణాత్ పూర్వం, ఈరెంటి మధ్యనే జీవితం. జననాత్ పూర్వంతోకాని మరణానంతరంతో కాని పనిలేదు. పుట్టకముందుది భూతకాలం, మరణానంతరం భవిష్యత్తు; ఈ రెండూ ప్రధానంకావు. ప్రధానమైంది జీవించి ఉన్న వర్తమానమే. ఈ

విషయాన్ని పారసీక కవిపుంగవుడు ఉమర్ ఖయాం తన రుబాయిలో అభివ్యక్తపరచక ముందే దూరప్రాచ్యదేశాల్లో జన్ సాధకులు ఎన్నోవందల సంవత్సరాలనాడు అభివ్యక్తపరచారు.

ఏ మత సంప్రదాయాలకు, ఏ ఆధ్యాత్మిక తత్వాలకూ, ఏ కర్మకాండలకూ కట్టుపడని ఈ జన్ బౌద్ధులు జడవాదులా అంటే కాదని, వారు చైతన్యవాదులని తెలుస్తుంది. వీరిదంతా విరుద్ధాభాస (Paradox) తో నిండి ఉంటుంది.

విశ్వమంతా చైతన్యమయమని, చైతన్యంలేంది ప్రాణి జీవించదనీ, మనం దేన్ని జడం అంటున్నామో అదికూడ చైతన్యపు స్థూల అస్తిత్వం అనేది వారి జీవన ఆచరణ. నేటి పరమాణు సిద్ధాంతంకూడ అదే చెపుతుంది. జడానికీ చైతన్యానికీ భేదం లేదని.

అందుకే జన్ బౌద్ధుల దృష్టిలో "The flame of life lies in the heart of each passing second" అని. ప్రతి సాగిపోతున్న క్షణంయొక్క హృదయంలోను ప్రాణజ్వాల ప్రజ్వలిస్తుంటుందని.

జన్ బౌద్ధం అంటే ప్రోజ్వలమైన ఒక అంతర్ జ్వాల.

## జన్ అనేదాని పుట్టు పూర్వోత్తరాలేమిటి?

క్రీ.శ. ఆరవ శతాబ్దంలో దక్షిణభారతదేశం నుంచి బోధిధర్మ అనే ఒక ప్రజ్ఞాశాలి అయిన బౌద్ధాచార్యుడు బౌద్ధబోధకు చైనా రావటం జరిగింది. ఆయన కేరళ నివాసి అని చెప్పబడు తూంది.

ప్రపంచంలోని ప్రతి మతంలోను ప్రధానంగా రెండు విధాలైన ఆచరణ విధానాలుంటాయి. ఒకటి బాహ్యమైన కర్మకాండ; రెండవది అంతరికమైన ధ్యానసాధన. మొదటి దానిలో పూజలు పురస్కారాలు, మంత్రాలు తంత్రాలు, దీపారాధనలు, నైవేద్యాలు మొదలైనవి ఉంటాయి. ఇదెక్కువ భాగం శారీరకం.

రెండవది ప్రధానంగా మానసికం. ఇందులో ధ్యానం ప్రధానం. దేన్ని గురించి ధ్యానం అంటే తమ ఇష్టమొచ్చిన వాటిని గురించి - ఆ ఇష్టమొచ్చినవి వ్యక్తులు కావచ్చు, వస్తువులు కావచ్చు, స్థలాలు కావచ్చు లేక ఏమీలేని శూన్యం కావచ్చు. బౌద్ధంలోకూడ ఈ విభాగం ఉంది.

భారతదేశంనుంచి చైనాకు పోయిన బోధిధర్మ అనే బౌద్ధాచార్యుడు ధ్యానవిధానానికి చెందిన మహామహుడు. ఆయన దృష్టిలో బాహ్యాచారాలతో నిండిన కర్మకాండకు ప్రాధాన్యం లేదు. అంతరంగధ్యాన సాధనకే ప్రాధాన్యం. చైతన్య స్రవంతిలో తన జీవన నౌకపైన తెరచాప ఎత్తటమే ఆయన సాధనాపథం.

ఇదే కాంతిపథంలోని క్రాంతి పథికుడు ఆచార్య బోధిధర్మ. ఆయన చైనాలో ఉన్న కాలంలో ఈ ధ్యాన బౌద్ధాన్ని చైనీయులకు బోధించసాగేడు. ఈ నూతన ధ్యాన బౌద్ధంలోని కాంతి, శాంతి చైనీయుల క్రాంత మానసాలను మానస సరోవరాలుగా మార్చసాగాయి.

సంస్కృత పదమైన ''ధ్యాన బౌద్ధం'' చైనావారి ఉచ్చారణలో ''ఛాన్ బౌద్ధం'' అయింది. చైనానుంచి ఆచార్య బోధిధర్మ జపాన్ పోవటం జరిగింది. జపాన్ వారి ఉచ్చారణలో ''జన్ బౌద్ధం'' అయింది. అప్పటినుంచి ప్రపంచంలో అది ''జన్ బౌద్ధం''గా వ్యాప్తిచెందసాగింది.

జపాన్‌లో బోధిధర్మ పేరుకూడ మారి ''దారుమా'' అయింది.

జన్ బౌద్ధంలో జపానీ పదమైన ''సతోరీ'' అనే దానికి ఎంతో విలువ ఉంది. నిజానికి ''సతోరీ'' లేంది ''జన్'' లేదు. సతోరీ అంటే మేధకందని ఒక మెరుపులాంటి అద్భుత జ్ఞానోదయం, ఒక పారదర్శక దృష్టి. దానికందని వస్తువుండదు, ఆలోచన ఉండదు, అనుభూతి ఉండదు, మరేమీ ఉండదు.

అందుకే అంటారు "When you have satori a palatial mansion can be created on a single blade of grass, but when you have no satori a single blade of grass can conceal a palatial mansion" నీవు సతోరీని కలిగి ఉంటే ఒక్క గడ్డిపోచమీద రాజభవనాన్ని నిర్మించవచ్చు, కాని నీవు సతోరీని కలిగి ఉండనపుడు ఒక్క గడ్డిపోచయే రాజభవనాన్ని కనపడకుండా కప్పివేస్తుందట!

సతోరీ అంటే అటువంటి అద్భుత జ్ఞానోదయం. అటువంటి జ్ఞానోదయం కలగబట్టే బుద్ధుడు లోక మరమ్మతు చేయకలిగెను. చేసిన మరమ్మతు శాశ్వతంగా నిలవలేదు అనేది వేరే విషయం. బుద్ధుడేకాదు, ఇంకెవరు చేసిన మరమ్మతులు కూడా శాశ్వతంగా నిలవవు. శాశ్వతత్వానికే శాశ్వతత్వం లేదు, అటువంటప్పుడు ఇక మరమ్మతులకు ఏమి శాశ్వతత్వం ఉంటుంది?

సతోరీ అనేది ఎక్కువకాలం వరకు (శాశ్వతకాలం వరకుకాదు) ఆరని ఒక పరమాద్భుత దీపం. ఆ దీపం మనిషిలో వెలుగుతున్నంత వరకు మానవుని శక్తి మహాత్మకంగా క్రియాశీలమై ఉంటుంది. అది ఒకనాటికి ఆరిపోయినప్పుడు ఆ మహాత్మక క్రియాశక్తి నిష్క్రియ అవుతుంది. సతోరీని ఇష్టమొచ్చినంతకాలం ఆరనీయకుండా కాపాడుకొనే శక్తిని జన్ సాధన మనిషికిస్తుంది.

జన్ ఆచార్యులంతా ఇటువంటి సతోరీని సృష్టించుకొనే నిమిత్తం తమ జీవితాలను మండే కాగడాలుగా మార్చుకొంటారు. ఇతర కాగడాలను వెలిగిస్తారు, తాము స్వయంగా కాగడాలై వెలుగుతారు.

కనుకనే జన్ ఆచార్యులు జీవంత జ్యోతులై ప్రకాశించారు, దిగంతాలకీవలి, ఆవలి సంగీతమై ప్రతిధ్వనించారు, పగటి సూర్యునితో, రాత్రుల శశితారలతో పోటీకి నిలిచారు!

సతోరీ ఒక ఊర్ధ్వ చేతనా ఆరోహణ.

చైనాలో బౌద్ధం ప్రవేశించేనాటికి అక్కడ వ్యాప్తిలో ఉన్న స్వదేశీ మతాలు రెండు. ఒకటి కన్‌ఫ్యూషియనిజం, రెండవది తావోయిజం. మొదటిదాని స్థాపకుడు జగత్ప్రసిద్ధుడైన కన్‌ఫ్యూషియన్, రెండవదాని స్థాపకుడు అంతకంటే కొంత తక్కువ ప్రసిద్ధుడైన తావ్-చు.

**కన్‌ఫ్యూషియనిజం నీతి ప్రధానమైన, నియమ ప్రధానమైన, సామాజిక దృష్టి ప్రధానమైన మార్గం; తావోయిజం అటువంటి వాటికి కట్టుబడని ఒక స్వేచ్ఛా మార్గం. మొదటి దానిలో ఆలోచన ప్రధానమైతే రెండవ దానిలో అనుభూతి ప్రధానం. ఒకదానికి కర్తవ్యం మొదటిది అయితే రెండవదానికి స్వేచ్ఛ ప్రధానం. మొదటి దానిది ఎక్కువగా శ్రేయం అయితే రెండవదానిది ఎక్కువగా ప్రేయం.**

అయితే, ప్రేయం మాత్రం శ్రేయం కాదా అంటే. ప్రేయం అంశికంగా శ్రేయమే కాని

సమగ్రంగా శ్రేయం కాదు. అంటే అన్ని విధాలయిన ప్రేయాలు కూడ శ్రేయాలు కావు; కొన్ని విధాలయినవి మాత్రమే శ్రేయాలవుతాయి.

**ఏది ఏమైనా కన్‌ఫ్యూషియనిజం దృష్టి, ప్రధానంగా శ్రేయానికి చెంది ఉంటే తావోయిజం దృష్టి ప్రధానంగా ప్రేయానికి చెంది ఉంటుంది.**

చైనాలో ప్రవేశ పెట్టబడిన జన్ బౌద్ధం మీద కన్‌ఫ్యూషియనిజం ప్రభావానికంటే తావోయిజం ప్రభావమే ఎక్కువ పడింది. మొదటిది ప్రతి చిన్న విషయాన్ని కూడ ఎంతో లక్ష్య భావంతో చూస్తుంది; రెండవది ప్రతి పెద్ద విషయాన్ని కూడ నిర్లక్ష్య భావంతో చూస్తుంది.

దీని అర్థం తావోయిజం అహంకారంతో నిండిందని, కన్‌ఫ్యూషియనిజం వినయ ప్రధానమనీ కాదు. తావోయిజంలోని అహంకారం ఇతర్లలోని అహంకారాన్ని పోగొట్టటానికే ఉన్నది. ఇతర్ల అహంకారాన్ని పోగొట్టాలంటే తనలోని అహంకారం ముందుగా నశించాలి. తనలో అహంకారం ఉంటే నశిస్తుంది కాని లేనపుడు ఎట్లా నశిస్తుంది. మూసిన తలుపును తీయవచ్చు కాని తీసి ఉన్న తలుపును తీయటం కుదరదు.

తన తోటివారిలోని అహంకారాన్ని నశింపచేసే శక్తి కావాలంటే ముందుగా తనలోని అహంకారాన్ని నశింప చేసే శక్తి కావాలి. తనలోని అహంకారాన్ని నశింప చేయాలంటే తనలో అహంకారం ఉండి తీరాలి. లేనిచో దాన్ని తొలగించే శక్తి రాదు. తనలోని దానిని తొలగించలేని శక్తి లేనపుడు ఇతర్లలోని దాన్ని తొలగించలేదు.

అహంకారం ఉండటం తప్పు కాదు, ఉన్నదాన్ని తొలిగించక పోవటం తప్పు.

కనుక తావోయిజంలో అహంకారం ఎందుకున్నదీ అంటే అది తొలగించబడటానికి ఉన్నది కాని ఉంచబడటానికి కాదు.

తావోయిజంలో ఉన్న అహంకారపు, లేక నిర్లక్ష్యపు ఛాయలు జన్ బౌద్ధం మీద ప్రసరించటం జరిగినందున జన్ బౌద్ధంలో కూడ ఆ ఛాయలు ముదురుగా కాకపోయినా, లేతగానైనా గోచరిస్తాయి.

ఈ సత్యాన్నే వ్యక్తం చేస్తాయి జన్ ఆచార్యుల కొన్ని వింత ప్రవర్తనలు. ఒక జన్ ఆచార్యుడు తనకు తలక్రింద దిండు దొరకనందున బుద్ధ ప్రతిమను తల క్రింద వేసుకొని పడుకున్నాడట!

మరో జన్ ఆచార్యుడు చలి వేస్తుంటే తన దగ్గరున్న కొయ్యతో చేయబడ్డ బుద్ధ విగ్రహానికి నిప్పు అంటించి చలిమంట వేసుకున్నాడట! ఈవిధంగా చేయటం గొప్ప అని కాదు, గొప్ప అనబడే వాటిలో గొప్ప కాని తక్కువ అనబడే వాటిలో తక్కువ కాని లేవని చెప్పటానికే. ఆచారాలకూ అనాచారాలకూ మధ్య అంతగా ప్రభేదం లేదని చూపటానికే.

సంప్రదాయాలకూ, ఆచారాలకూ, రీతులకూ రివాజులకూ కట్టుబడని ఈ జన్ బౌద్ధులు హేతువాదులై ఉంటారనిపిస్తుంది. కాని వారి ప్రవర్తనను పరిశీలించి చూస్తే వారు హేతువాదానికి కూడా అతీతులని తెలుస్తుంది.

ఒక సజీవమైన బాతు ఒక సీసాలో ఉంటుంది. ఆ సీసా మూతి సన్నగా ఉంటుంది. ఆ బాతుకు హాని కలగకుండా, ఆ సీసాను పగులగొట్టకుండా, ఆ బాతును సీసా నుండి బయటికి తీయాలి. ఇటువంటి అసాధ్యం సాధ్యం ఎట్లా అవుతుంది? అదుగో ఆ బాతు

బయటికి వచ్చేసింది! అని గ్రహించటమే ఇందుకు పరిష్కారం.

ఇది సహేతుకమైన సంఘటన కాదు. లావైన బాతు సన్నని సీసా మూతి గుండా ఎట్లా బయటికి వస్తుంది? సహేతుక దృష్టికి వ్యతిరేకమైన విషయం ఇది. దీనికి పరిష్కార మార్గం హేతువాదంలో కాక హేత్వాతీతవాదంలో మాత్రమే లభ్యమవుతుంది.

ఇందుకు ''ఎట్లా'' అనే ప్రశ్న ఉండకూడదు. ''అట్లా'' అనే సమాధానమే ఉండాలి. ఎట్లా జరిగింది అనే ప్రశ్న లేనప్పుడు అట్లా జరిగింది అనే ఒక అనుభవం ఏర్పడుతుంది. ఇదొక ప్రత్యక్షానుభూతిని కూడా దాటిన జీవనానుభవం; హేతుబద్ధం కాని, వాస్తవం కాని, వాస్తవాభాస.

హేతువాదాన్ని మూడు విధాలుగా విభజించవచ్చు – అధో హేతువాదం (sub-rationalism), హేతువాదం (rationalism), ఊర్ధ్వ హేతువాదం (para-rationalism). బాతు సంఘటన ఊర్ధ్వ హేతువాదానికి చెందుతుంది. అటువంటి అసహజ సంఘటన జరగగలదా లేదా అనేది ప్రధానం కాదు. జరుగుతుంది అనే ఒక చేతనా శక్తి మనిషిలో వికసించటం ప్రధానం. అటువంటి బలీయమైన మానస క్రియ మనిషిలో స్పష్టమైనపుడు సామాన్య మానసిక బలహీనతలు నశిస్తాయి.

ఇదంతా ఒక రకంగా వాస్తవ వాదం కాదు, ఆదర్శ వాదం అవుతుంది. ఏది లోకంలో జరగటానికి అవకాశం ఉండదో అది జరగాలనే దృఢమైన ఆదర్శ వాదాన్ని చూపుతుంది. అంటే లోకంలో అసంభవం అనేది ఉండరాదని.

''కాదు'' అనేది, ''అవుతుంది'' అనే దానిలోకి రూపాంతరం చెందాలనే ఆకాంక్ష, ఆదర్శం.

అంటే ఈ సృష్టిలో సాధ్యం కానిది లేదని.

ఈ సృష్టియే సాధ్యమైనపుడు ఇక ఈ సృష్టిలోనిది ఏది సాధ్యం కాదు? క్రియలో సాధ్యం కానిది భావనలో సాధ్యమవుతుంది. భావనలో సాధ్యమైంది ఒకనాటికి క్రియలో కూడ సాధ్యమవుతుంది. ఈ సాధ్యాన్ని తెలపటానికే సన్న మూతి సీసాలోని బాతును గురించిన ఉదాహరణ.

మనిషి ప్రకృతి శక్తులను జయించేవాడే కాని వాటిచేత జయించబడే వాడు కాదు. ఇప్పటికి ప్రకృతి శక్తులన్నిటినీ ఎందుకు జయించలేక పోయినాడు అంటే మనిషి కంటే ప్రకృతి ఎన్నో కోట్ల సంవత్సరాలు వయసులో పెద్దది. అది సంతరించుకున్న శక్తిని మనిషి పూర్తిగా సంతరించుకోలేదు. క్రమేణ అటువంటి శక్తిని, అంతకు మించిన శక్తిని సంతరించుకొంటూ ప్రకృతిని ఇప్పటికే చాలా వరకు జయించాడు, ఇక ముందు ఇంకెంతో జయిస్తాడు.

మనిషికి బయటున్నదాన్ని ప్రకృతి అంటాం. అదేవిధంగా మనిషి లోపలి స్వభావాన్ని కూడా ప్రకృతి అని అంటాం. ఒకటి బహిరంగ ప్రకృతి, రెండవది అంతరంగ ప్రకృతి. ఒకటి నిసర్గ ప్రకృతి, రెండవది మానవ ప్రకృతి.

నిసర్గ ప్రకృతి కంటే మానవ ప్రకృతి వయసులో కోట్ల సంవత్సరాలు లేతదైనా కూడ శక్తిలో యుక్తిలో తక్కువైనది కాదు, ఎక్కువైనదే. నిసర్గ ప్రకృతికి శక్తి మాత్రమే ఉన్నది కాని యుక్తి లేదు. యుక్తి లేని శక్తి కాని, శక్తి లేని యుక్తి కాని సమగ్రాలు కావు.

మిసిమి, ఆగష్టు 1992

మనిషిలో ఉన్నవి రెండూ కూడా – శక్తీ, యుక్తీ. యుక్తి లేని శక్తి మాత్రమే ఉన్న నిసర్గ ప్రకృతిని శక్తీ యుక్తీ రెండూ ఉన్న మానవ ప్రకృతి అవలీలగా జయిస్తుంది.

జన్ బౌద్ధుల ఆదర్శాలు మట్టిని అతిక్రమించి మేఘమాలల్లో సంచరిస్తున్నా కూడ వారు మట్టికి విలువ ఇవ్వటాన్ని మరువ లేదు. నిత్య జీవితంలోని ప్రతి అల్పమైన పనిని కూడా వారు గొప్పగా పవిత్రంగా చూస్తారు. ధ్యానం చేయటానికి ఎంత విలువ ఇస్తారో స్నానం చేయటానికి కూడ వారు అంత విలువ ఇస్తారు. తలను కాపాడే టోపీని తయారు చేసుకోటానికిచ్చిన ప్రాధాన్యాన్నే పాదాలను కాపాడే పాద రక్షలను తయారు చేసుకోటానికి కూడ.

వారికి ఆధ్యాత్మిక జీవితమనీ భౌతిక జీవితమనీ భేద భావం లేదు. లోక ప్రవర్తనకూ లోకోత్తర ప్రవర్తనకూ సమాన స్థానమే. దైనందిన జీవితమే దివ్యానంద జీవితం.

ప్రత్యేక విషయం ఏమంటే జన్ బౌద్ధుల జీవితాల్లో కళలకు, ప్రత్యేకించి కవిత్వానికీ చిత్రకళకూ ఎక్కువ ప్రాధాన్యం. ప్రతి జన్ ఆచార్యుడూ కూడ కవియో చిత్రకారుడో అయి ఉంటాడు, లేక రెండూ కూడ.

వారి కవిత్వంలో హైకూ కవిత, హైగా చిత్ర రచన ప్రధానమైనవి. ఈ రెండూ కూడ అభిధాత్మకంగా కాకుండా, కొంత లక్షణాత్మకంగాను, కొంత వ్యంజనాత్మకంగాను ఉంటాయి. అభిధ కేవలం ఉన్నదానికి ఉన్నట్లు అభివ్యక్తిని ప్రసాదిస్తే లక్షణ, వ్యంజన ఉన్నదున్నట్లు కాక దానిలోని కొంత ప్రధాన భాగాన్ని ఉండీ లేనట్లుగా చూపుతాయి.

అరణ్యాన్ని చూపటానికి అభిధ అరణ్యంలోని చెట్లు అన్నిటినీ చూప ప్రయత్నిస్తుంది. లక్షణ, వ్యంజనలు, అరణ్యంలోని ఒకటి రెండు చెట్లను మాత్రమే ప్రతీక రూపంలో చూపి అరణ్యభావనను జనింప చేస్తాయి. ఈ విధానానికే చెందుతాయి జన్‌లోని హైగా చిత్రాలు, హైకూ కవితలూ.

అల్పంలో అనల్పాన్ని ప్రత్యక్ష పరుస్తాయి ఈ కవితాకళా, చిత్రకళా కూడ. మేఘాలు లేని చోట ఇంద్రధనుసును సృష్టిస్తాయి, వీణ లేనిచోట వైణికనాదాన్ని వినిపిస్తాయి!

హైకూ కవితకు మూడు చరణాలుంటాయి. మొదటి చరణానికి అయిదు మాత్రలు, రెండవ చరణానికి ఏడు మాత్రలు, మూడవ చరణానికి అయిదు మాత్రలు ఉంటాయి. అంటే మొత్తం పదిహేడు మాత్రలుంటాయి హైకూ కవితకు.

ఈ జన్ కవులు హైకూ కవితకు పదిహేడు మాత్రలను ఏర్పరచుకోటానికి బౌద్ధతత్త్వ గ్రంథమైన ''అభిధమ్మ'' కారణం. ఇంద్రియ గ్రహణం ద్వారా చైతన్యవాహిని ఏర్పడుతుంది. దాని కాలం పదిహేడు చిత్త క్షణాలు (thought-instants). కనుకనే వీరు ''అభిధమ్మ'' ననుసరించి తమ హైకూ కవితకు పదిహేడు మాత్రలను నిర్ణయించుకున్నారు. కొన్ని యితర భాషల కవితల్లో ఉన్నట్లు జపాన్ వారి కవితల్లో అంత్య ప్రాసలు ఉండవు. తెలుగు కవితల్లోనూ ఉండవు సాంప్రదాయికంగా అంత్యప్రాసలు.

ఈ హైకూ కవితా సృష్టి జపాన్‌లో క్రీ.శ. 14వ శతాబ్దంలో ఆవిర్భవించినట్లు తెలుస్తుంది. జన్ బౌద్ధం జపాన్‌లో ప్రవేశించిన కొంత కాలానికి కాని ఈ కవితా రీతి ఉద్భవించలేదు. హైకూ కవులను 'హైజన్' అంటారు.

గెనీషా కవి రచించిన హైకూ: (కవితల అనువాదాలు రచయితవి)

''ధర్మోపన్యాసాన్ని నీరసంగా పేలవంగా
తీసుకొన్నాయి నా చెవులు,
కాని బయటి అరణ్యాల్లోని కోయిల.''

ఈ కవితల్లో స్పష్టత సంపూర్ణత ఉండవు. ధార్మిక విషయాల కంటే అరణ్యంలోని కోయిల ఎక్కువ ప్రధానమన్నట్లు ధ్వనిస్తుందీ కవిత. గుడిగంటల మ్రోత కంటే అరణ్యపు కోయిల పిలుపే ఎక్కువ ఆనందదాయకం అని.

మరో కవి హిస్సా అనేవాని హైకూ:

''ఓ పిరికి నత్తా, నీవు సహజంగా
బలహీనవు, తక్కువదానవు, అయినా
ఫ్యూజీ పర్వత శిఖరానికి ప్రాకు నెమ్మది నెమ్మదిగా.''

ప్రపంచంలోని బలహీన జీవులేవీ, ఆలస్యపు జీవులేవీ ఏమాత్రం భయపడాలసిన అవసరం లేదు. వాటి బలహీనతయే వాటి బలం; వాటి ఆలస్యమే వాటి తొందర. నత్త నడక అని సామెతే ఉన్నది. మనిషి ఒక గంటలో నడిచే దూరాన్ని నత్త ఒక సంవత్సరంలో నడవవచ్చునేమో. అటువంటి నత్తకు కవి హితవు చెపుతున్నాడు ఫ్యూజీ పర్వత శిఖరాన్ని అధిరోహించమని. దాని జీవిత కాలం సరిపోదేమో శిఖరాన్ని చేరటానికి!

చేరకుండా మధ్యలో మరణిస్తే మాత్రం ఏమి? దాని కార్యబలం చాలక పోయినా దాని సంకల్ప బలం చాలు – ఎక్కాలనే సంకల్ప బలం! ప్రయత్నంలో ఉన్నది ప్రాముఖ్యం, ఫలితాల్లో లేదు. కావలసింది కార్య శూరత, జయాపజయాలు కావు. ఒక మహత్కార్యాన్ని అల్పజీవి, దుర్బల జీవి నెరవేర్చ సంకల్పించి ప్రయత్నించటం!

ఈ క్రిందిది ర్యోటా అనే కవిది:

''ఆతిథేయుడు మాటాడలేదు,
అతిథి పలక లేదు,
తెల్ల చేమంతి కూడ మౌనం తాల్చింది.''

జన్ బౌద్ధంలోనే కాదు, అసలు బౌద్ధంలోనే శూన్యానికీ మౌనానికీ ఎంతో ప్రాధాన్యం. రూపం లేంది శూన్యం, శబ్దం లేంది మౌనం. మౌనం అనంత ప్రశాంతిని తెలుపుతుంది. అటువంటి ప్రశాంత మౌనాన్నే తెలిపేడు కవి; పైనున్న హైకూలో. చేమంతి కాని మరో మొక్క కాని ఎల్లప్పుడూ మౌనాన్ని తాల్చే ఉంటుంది. కాని ఆతిథేయుడూ అతిథీ ఒక చోట సమావేశమైనపుడు సహజంగా మౌనం తాల్చరు. కాని ప్రశాంతిని ఇంకా ఎక్కువ ప్రశాంత పరచటానికి వారిద్దరినీ కూడ మౌన మూర్తులను చేశాడు తెల్ల చేమంతితో సహా! మౌనపు వ్యంజన రూపాన్ని సృష్టించటంలో కవి సఫలుడైనాడు.

మరణశయ్యమీది ఒక కవి అంటాడు కోయిల పాట వింటూ:

''ఓ కోయిలా నీ పాట సగం విన్న తరువాత
నేను మరో ప్రపంచానికి పయనిస్తున్నాను
మిగతా సగం పాట వినటానికి.''

ఎంత కరుణామయ దృశ్యమో ఇది. మరణాసన్న వ్యక్తి దైవాన్ని ప్రార్థించటానికి బదులు కోయిల పాట వింటూ మరణ శయ్యపై పడుకొన్నాడు. అయితే అతని నమ్మకం ఏమంటే ఆ కోయిల పాట పూర్తి కాకముందే తాను ఈ మర్త్య లోకాన్ని వదలి వెళతానని. ఈ లోకంలో వినేది సగమే, మరణానంతరం మరో ప్రపంచంలో మిగిలిపోయిన సగం పాట వింటాను అని.

ఈవిధంగా ఎన్నో వేల హైకూ కవితలను రచించారు జన్ బౌద్ధులు. వాటిలో వారి హృదయోద్గారాలు రసమయ ద్వారాల గుండా ఆనంద నికేతనాలను అందుకొని పరవశించాయి.

ఇక శబ్దం ద్వారా నిశ్శబ్ద శిఖరాలను ఈ హైకూ కవులు అందుకుంటే రూపం ద్వారా, అరూప శూన్యాన్నందుకొన్నారు హైగా చిత్రకారులు. శ్రవ్యమైన హైకూ చిత్రాల దృశ్యమైన రూప ప్రతికృతులే ఈ హైగా చిత్రాలు. అవి కవితల్లో వ్యంజనలైతే ఇవి చిత్రాల్లో వ్యంజనలు!

నీటి రంగుల లేత కాంతులతో పూర్ణ రూపాలను కాక ఆంశిక రూపాలను ఉండీ లేనట్లు అస్పష్టంగా చిత్రిస్తారు జన్ బౌద్ధులైన ఈ హైగా చిత్రకారులు.

పగిలిన ఎండు చెట్టులోని తొర్రనో, జలపాతంలోని ఒక క్రింద పడుతున్న నురుగున్న భాగాన్నో, ఎగరలేని కొంగ యొక్క విరిగిన రెక్కనో, అదృశ్యమైపోతున్న ఇంద్రధను ఆభాసనో చిత్ర నైపుణితో ప్రదర్శించక పిల్లలు చిత్రించినట్లు చిత్రిస్తారు.

నిజానికి జన్ బౌద్ధం బోధిధర్మ స్వయంగా మొత్తం సృష్టించింది కాదు. అంతకుముందు భారతీయ బౌద్ధ సంప్రదాయాల్లో ప్రత్యేకించి ధ్యాన బౌద్ధం అని లేకపోయినా, బౌద్ధంలో ధ్యానానికి చాలా ప్రాధాన్యం ఇవ్వబడి ఉన్నది.

జన్ బౌద్ధంలో మిగతా బౌద్ధ సంప్రదాయాలలో వలె నిర్వాణం పొందటానికి యుగ యుగాలుగా జన్మలెత్తి వివిధ సాధనలు చేయాలసిన పనిలేదు. అప్పటికప్పుడు వెంటనే నిర్వాణాన్ని అందుకోవచ్చు.

అసలు జన్ బౌద్ధుల దృష్టిలో నిర్వాణం అనేది ఎక్కడో కాని, ఎప్పుడో కాని ఉండదు, ఇక్కడే ఇప్పుడే ఉంటుంది; దాన్ని పట్టుకోటంలోనే ఉన్నది చాకచక్యం.

దేన్నయినా దగ్గర లేనిదాన్ని వెదకవచ్చుకాని ఉన్నదాన్ని వెదకటమేమిటి? ఉన్నదాన్ని అన్వేషణ ప్రారంభిస్తే ఉన్నది లేకుండా పారిపోతుంది అని జన్ బౌద్ధుల అభిప్రాయం.

నిర్వాణాన్ని అందుకోటానికి రెండు విధాల మార్గాలున్నట్లు బౌద్ధ గ్రంథమైన ''లంకావ తార సూత్ర'' (భారతదేశంలోది) లో రచించబడి ఉన్నది. యుగాల తరబడి అనేక జన్మల్లో సాధన చేసి నిదానంగా పొందే నిర్వాణ పద్ధతి ఒకటని, అక్కడికక్కడ అప్పటికప్పుడు వెంటనే నిర్వాణ ప్రాప్తిని చెందటం మరొకటని. ఈ రెండవ మార్గం దూర ప్రాచ్య దేశాల్లోని జన్ బౌద్ధంలో ప్రాధాన్యం చెందింది. భారతదేశంలో 'వజ్రచ్ఛేదిక' అనే బౌద్ధ సిద్ధాంతంలో కూడ ఈ త్వరిత నిర్వాణ ప్రాప్తి వ్యాప్తిలో ఉన్నది.

వెదకవద్దు, అందుకో. కళ్లు మూసుకొని ధ్యానించవద్దు, కళ్లు తెరచి చూస్తూ ధ్యానించు. బయటి దృశ్య జగత్తంతా ఉన్నది చూడకుండా ఉండటానికి కాదు, చూడటానికే.

ధ్యానం అనేది బాహ్య ప్రకృతికి దూరం కావటానికి కాదు, ఇంకా ఎక్కువ దగ్గర కావటానికే. ఇంద్రియానుభూతి నిర్వాణానికి శత్రువు కాదు, మిత్రమే. అన్నిటినీ పరిత్యజించటం కాదు 'బోధి' అంటే, అన్నిటినీ కౌగిలిలోనికి తీసుకోటమే. సంక్షిప్తంగా ఇదీ జన్ బౌద్ధం.

మూఢ నమ్మకాలు లేని మతం కాని, సిద్ధాంతాలు కాని, మార్గాలు కాని లేవు. పుక్కిటి పురాణాలు అన్నిటా వ్యాపించి ఉన్నాయి. హేతుబద్ధం అనుకొనే బౌద్ధంలోను, అంతకంటే ఇంకా ఎక్కువ హేతుబద్ధం అనుకొనే జన్ బౌద్ధంలోను కూడ ఇటువంటి కట్టు కథలకు కొదువ లేదు. బోధిధర్మం గురించిన ఈ క్రింది గాథ అటువంటిదే.

బోధిధర్మం (జపాన్ భాషలో ''దారుమా'') చాలా భయంకరంగా కనిపించే వ్యక్తి అనీ, పొదలాంటి గడ్డం కలిగి ఉంటాడనీ, పూర్తిగా తెరచిన కళ్ళు కలిగి ఉంటాడనీ, ఆ కళ్లలో కొంత మెరుపు ఉండేదనీ. సరే ఇంతవరకు బాగుంది. ఒకసారి ఆయన నిద్రపోయినాడట ధ్యానంలో ఉండగా. అంతటితో ఆయనకు విపరీతమైన కోపం వచ్చి తన కను రెప్పలను కోసి నేలకు విసిరాడట. నేలమీద ఆ రెండు రెప్పలూ రెండు మొక్కలుగా మొలచినవట. అవే మొదటి తేనీటి మొక్కలట. ఆ మొక్కలు తేనీటి మొక్కలుగా చైనాలో వ్యాప్తి చెందినవట. తరువాత వాటి నుంచి తయారుచేసిన తేనీరే జన్ సాధకులకు నిద్ర రాకుండా కాపాడినదట తమ ధ్యాన సమయంలో. అంతేకాక మానసాలకు కూడా కావలసినంత చురుకుదనాన్నీ, బలాన్నీ ప్రసాదించేదట. అందుకే అనేవాళ్లు జన్ యొక్క రుచీ, తేనీటి రుచీ ఒకటిగా ఉంటుందని. అందుకే చైనా భాషలో జన్‌ను ''ఛాన్'' అనీ, తేనీటిని ''చా'' అనీ అంటారు. ఉత్తర భారతదేశంలో కూడ తేనీరును ''చా'' అనే అంటారు కనుక మనకు తేనీరు చైనా నుంచే దిగుమతి అయింది.

బోధిధర్మకు సంబంధించిన పై కథ ఎంత విడ్డూరమైనదో! జన్‌లో కూడ ఇటువంటివి అక్కడక్కడ కనిపిస్తాయి.

జన్ ఆచార్యులు తమను అడిగే ప్రశ్నలకిచ్చే సమాధానాలు విచిత్రంగా ఉంటాయి. ఒకనాడు ఒక సాధకుడు బోధిధర్మను అడిగేడు, తన మనసుకు శాంతి లేకుండా ఉన్నది, దాని నివారణకు ఉపాయం ఏమిటని.

అందుకు బోధిధర్మ ఆయనతో అన్నాడు ''నీ మనసుని తీసి నా ముందు ఉంచు, నేను దానికి ప్రశాంతి కలిగిస్తాను'' అని. అందుకు ఆ వ్యక్తి అన్నాడు, ''నా మనసును నేను ఎంత వెదకినా అది నాకు కనిపించనే లేదు'' అని. అందుకు బోధిధర్మ తిరిగి జవాబు ఇచ్చాడు ''అంటే నీ మనసును నేను ప్రశాంత పరచానన్న మాట'' అని.

వీరి సంభాషణలు ఇటువంటి వింత ధోరణుల్లో ఉంటాయి!

జన్ బౌద్ధానికి ఆధునిక ప్రధానాచార్యుడు జపాన్‌లో ప్రొఫెసర్ డి.టి. సుజూకీ. జన్‌ను గురించి పాశ్చాత్యులకు తెలపటానికి ఆయన ఎన్నో జన్ గ్రంథాలను ఇంగ్లీషులో రచించాడు. కొన్ని బౌద్ధాన్ని గురించిన మహాయాన సంస్కృత గ్రంథాలను గురించి కూడ ఆయన గంభీరమైన వ్యాఖ్యలు రచించాడు.

క్రిందటి శతాబ్దంలోను, ఈ శతాబ్దంలోను జపాను సంస్కృతి పాశ్చాత్య దేశాలలోకి దిగుమతి అవుతూండటంతో పాశ్చాత్య విదుషుల దృష్టిని జన్ ఆకర్షించింది. దాంతో చాలామంది పాశ్చాత్యులు జన్ బౌద్ధాన్ని అధ్యయనం చేసి దాన్ని గురించి గ్రంథ రచనలు చేశారు.

వారిలో ఆర్.హెచ్. బ్లైత్, క్రిస్టమన్ హంఫ్రీన్, ఎ.డబ్ల్యూ. వాట్స్ మొదలైన కొందరు ముఖ్యులు. ప్రసిద్ధ జన్ ఆచార్యులు రచించిన హైకూ కవితల్ని కొందరు పాశ్చాత్యులు తమ భాషల్లోకి అనువాదం చేసుకున్నారు.

ఈవిధంగా జన్ బౌద్ధం గురించి ప్రపంచంలోని చాలమందికి తెలిసిపోయింది.

మరో విశేషమేమంటే క్రీ.శ. ఆరవ శతాబ్దంలో భారతీయుడైన ఆచార్య బోధిధర్మ చైనాలో ధ్యాన బౌద్ధాన్ని (చైనా భాషలో "ఛాన్") ప్రాదుర్భావం చేశాడనేది వాస్తవం కాదని, అది ఒక కల్పిత కథ మాత్రమే అని ఒక వాదన ఉన్నది. ఈ వాదన ప్రకారం ఛాన్ బౌద్ధం అనేది అంతకు ముందు నుండే చైనాలో ఉన్నదని.

కాని బోధిధర్మ విషయమే వాస్తవమని ప్రపంచంలోని విజ్ఞుల చేత నమ్మబడుతూంది.

సరే, జన్ బౌద్ధాన్ని ఎవరు ఆవిర్భవింప చేశారు అనే ప్రశ్నతో పని లేదు. దాన్ని ఎవరైనా ఆవిర్భవింప చేసినా, లేక దానంత అది ఆవిర్భవించినా, అదొక విలక్షణమైన చైతన్య స్రవంతి, ఒక విశిష్టమైన చింతావాహిని, ఒక ఆనందమయ జీవన పథం! ★

## OF MOTHERS AND DAUGHTERS

When mothers are not much older than their daughters. May be about 18 to 21 years separate the two. A sense of rivalry and hostility dominates their relationship. This is the daughter's 'unconscious motivation' in rebelling against her mother.

The mother often imposes her idealistic self upon the youngester. And when the daughter fails to live up to the exceptations, depression creeps in.

# బోరిస్

# పాస్టర్‌నాక్

(బోరిస్ పాస్టర్ నాక్‌కు 1958లో నోబెల్ బహుమతి ప్రకటించటం, రష్యాలో అప్పుడు నెలకొనివున్న పరిస్థితులవల్ల ఆయన దాన్ని స్వీకరించలేక పోవటం, ఆ తరువాత 31 సంవత్సరాలకి ఆయన కొడుకు యూజనీ పాస్టర్‌నాక్ 1989లో దాన్ని స్వీకరించటం అందరికి తెలిసిన విషయమే. ఆ సందర్భంలో యూజినీ పాస్టర్‌నాక్ రాసిన వ్యాసానికి ఇది సంక్షిప్త అనువాదం).

పాస్టర్‌నాక్ నోబెల్ బహుమానాన్ని తిరస్కరించటానికి కారణం అతని మీద అప్పుడు వున్న ఒత్తిడి అని, అందువల్ల ఆ తిరస్కారానికి విలువలేదని గుర్తించి, ఆ డిప్లమాని, పతకాన్ని ఆయన మరణానంతరం ఆయన కుటుంబానికి ఇవ్వాలని నోబెల్ కమిటీ నిర్ణయించటం పాస్టర్‌నాక్ జన్మదిన శతాబ్ది వుత్సవాలు జరుపుకుంటున్న సందర్భంలో ప్రముఖమైన సంఘటన. 1958లో పాస్టర్‌నాక్‌కి నోబెల్ బహుమతి అనే వార్త రష్యాలో అతనిని అనేక ఇబ్బందులకి గురిచేసి అతని జీవితం త్వరగా ముగియటానికి కారణం అయింది. ముప్పై సంవత్సరాలపాటు అతనికి ఇవ్వబడ్డ నోబెల్ బహుమతి గురించిన విషయం బహిరంగ చర్చల నుండి నిషేధింపబడి ఒక మిస్టరీలాగా మిగిలిపోయింది.

పాస్టర్‌నాక్‌కి నోబెల్ బహుమతి ఇవ్వవచ్చు అనే వార్త రెండవ ప్రపంచ యుద్ధం ముగిసిన తరువాత నుండి వినిపించటం మొదలయింది. ఇప్పుడు నోబెల్ కమిటీకి అధిపతిగా వున్న లార్స్ గైలాన్ అభిప్రాయం ప్రకారం పాస్టర్‌నాక్ పేరు 1946 నుండి 1950 వరకు ప్రతి సంవత్సరం చర్చకి వచ్చింది. 1957 మళ్ళీ ఈ చర్చ ప్రారంభమై చివరికి 1958లో అతనికి బహుమతి ప్రకటింపబడ్డది. ఈ వార్త అతనికి వెంటనే ప్రత్యక్షంగా తెలియలేదు. అయితే సోవియట్ పత్రికలలో అతనికి వ్యతిరేకంగా జరుగుతున్న ప్రచారంవల్ల అతనికి ఆ విషయాన్ని వూహించే అవకాశం కలిగింది. తనమీద ప్రత్యక్షంగా జరగబోయే దాడుల్ని నివారించుకోవటానికి తనకి యూరప్‌లో వస్తున్న పేరు ప్రఖ్యాతులకి సంబంధించి తను రష్యాలో క్షమాపణలు చెప్పుకోవటానికి కూడా సిద్ధపడ్డాడు. ఒకసారి ఆయన ఇట్లా రాశారు– ''రచయితల సంఘం సమాచారం ప్రకారం పశ్చిమ దేశాల్లో కొన్ని సాహిత్య బృందాలు నా రచనలకి అసాధారణ ప్రాముఖ్యాన్ని ఇస్తున్నాయి.''

పశ్చిమ దేశాల్లో తన సాహిత్యం పట్ల కనపడుతున్న ఆసక్తి, తాను రష్యన్ ఆత్మిక (Spiritual) జీవనానికి వీలునామాగా భావించిన ''డాక్టర్ జివాగో'' నవల మీద దృష్టి కేంద్రీకరించేటట్టు చేసింది.

1954లో ఓల్గా ఫ్రెయిడెన్ బెర్గ్, లెనిన్‌గ్రాడ్ నుండి తనకి ఇలా రాసింది – ''మీకు నోబెల్ బహుమతి ఇవ్వబడింది అనే వార్తలు ఇక్కడ ప్రచారంలో వున్నాయి. అది నిజమా? అట్లాకాకపోతే ఆ పుకార్లు ఎక్కడినుండి పుడుతున్నాయి'' అందుకు సమాధానంగా పాస్టర్ నాక్ ఇట్లా రాశాడు – ''అటువంటి పుకార్లు ఇక్కడ కూడా ప్రచారంలో వున్నాయి. వాటిని గురించి తెలిపిన వాళ్ళలో

నేను చివరివాణ్ణి. ఈ అవార్డువల్ల స్వీడన్ వెళ్ళటం, విశాల ప్రపంచంలో భావాల్ని పంచుకోవటం జరిగినప్పటికీ, ఆ ప్రయాణంలో పార్టీ తోలు బొమ్మలాగా నేను ప్రవర్తించలేను. పైగా నాకు నా కుటుంబం, అసంపూర్తిగా మిగిలిన నవలలూ వున్నాయి. నా పేరు అవార్డు కోసం ప్రతిపాదించబడ్డట్టు గానే కన్పిస్తుంది. దానికి తగిన మద్దత్తు కూడా వుంది. బెల్జియం, ఫ్రెంచి, పశ్చిమ జర్మనీ పత్రికలు దాన్ని గురించి చాలా రాశాయి. ఆ వ్యాసాలు చదివిన వాళ్ళు నాకు తెలియపర్చారు. నా పేరు ప్రతిపాదించబడిందని ఎవరో బి.బి.సి.లో విన్నట్లు తెలిసింది. (నేను దాన్ని నిజం అని ధృవపర్చలేను). మనదేశంలో పద్ధతులు తెలిసిన వాళ్లు రాయబార కార్యాలయంలో సంప్రదించగా అక్కడి వాళ్ళు నాకు బదులుగా షోలకుప్ పేరు సూచించారని తెలిసింది.''

ఆ తరువాత ఒక సంవత్సరానికి 'డాక్టర్ జివాగో' నవల పూర్తయింది. 1957లో నోబెల్ బహుమతి గ్రహీత అయిన అల్బర్ట్‌కామూ దాని ఫ్రెంచి అనువాదాన్ని చాలా శ్రద్ధగా పరిశీలించాడు. తన నోబెల్ వుపన్యాసంలో పాస్టర్‌నాక్ గురించి చాలా వున్నతంగా మాట్లాడాడు. ఏమయితేనేం 1958 అక్టోబర్‌లో నోబెల్ కమిటీ సెక్రటరీ అండర్స్ ఓస్టర్‌లింగ్ నుంచి ఉత్తరం వచ్చినపుడు పాస్టర్‌నాక్ చాలా సంతోషంతో తన అంగీకారం తెలుపుతూ టెలిగ్రాం ఇచ్చాడు. తన మిత్రులనుండి అభినందనలు, టెలిగ్రాములు ప్రవాహంలా వస్తున్నాయి. పత్రికల వాళ్ళు ఇంటిని నిరంతరం చుట్టుముడుతూ వున్నారు. జనైడా నికోలెవ్నా ఏ విధమయిన దుస్తులు ధరించి వెళ్ళాలో చర్చిస్తూ వుంది. నవల ప్రచురణవల్ల వచ్చిన ఇబ్బందులు, కలిగిన బాధ, సెంట్రల్ కమిటీకి, రచయితల సంఘానికి వచ్చిన సమస్య వెనుకబడి పోయాయి. నోబెల్ బహుమతి మొత్తం రష్యన్ సాహిత్యానికి లభించిన విజయం, గుర్తింపు, గౌరవంగా భావింపబడింది.

కాని రెండవరోజు ఉదయం కాన్‌స్టాంటిన్ ఫెడిన్, పాస్టర్‌నాక్ ఇంటికి వచ్చి, ఇంట్లో వున్న పాస్టర్‌నాక్ భార్యని పలకరించకుండా సరాసరి ఫస్ట్‌ఫ్లోర్‌లో వున్న పాస్టర్‌నాక్ రీడింగ్ రూంలోకి వెళ్ళి పాస్టర్‌నాక్‌ని వెంటనే బహుమానాన్ని తిరస్కరించాలని, అట్లా చేయకపోతే ఆ తరువాత రోజునుండి తనకి వ్యతిరేకంగా పత్రికలు ప్రచారం ప్రారంభిస్తాయని బెదిరించాడు. ఈ గౌరవాన్ని తిరస్కరించేటట్టు తనని ఏదీ కదిలించలేదని, తన అంగీకారం అప్పటికే నోబెల్ కమిటీకి పంపానని, తన మాటని వెనక్కి తీసుకోలేనని స్పష్టం చేశాడు.

ఆ రోజుల్లో నేను ప్రతిరోజూ పెరిడెల్‌కినో ఇంటి దగ్గరికి వెళుతుండే వాడిని. నాన్న ఎప్పటిలాగానే యథావిధిగా తన కార్యక్రమాలు కొనసాగిస్తున్నాడు. ఆయన స్లోవాక్కి పుస్తకం 'మేరీ స్టువార్ట్' అనువదిస్తూ ప్రశాంతంగా వున్నారు. ఏ వార్తాపత్రికలు చదివేవారు కారు. నోబెల్ బహుమతి తీసుకోవ టంవల్ల వచ్చే ఇబ్బందులను ఎదుర్కోవటానికి సిద్ధంగా వున్నట్టు చెప్పారు. ఈ సమయంలోనే రచయితల సంఘ ప్రిసీడియంకి ఆయన ఒక లేఖ రాశారు. జార్జి మార్కోవ్ ఆజ్ఞ ప్రకారం తనని రచయితల సంఘం నుండి బహిష్కరించిన సమావేశానికి ఆయన హాజరు కాలేదు. రచయితల సంఘ ఆర్కైవ్స్‌లో ఆ లేఖ సంపాదించటానికి అనేక ప్రయత్నాలు చేశాము. అది ధ్వంసం చేయబడ్డ విషయం స్పష్టమయింది. నాన్న పెరిడెల్‌కినో ఇంటికి వెళుతూ ఆ లేఖ గురించి చిరునవ్వుతో నాకు చెప్పారు. అందులో ఇరవై రెండు అంశాలు వున్నాయి. నాకు గుర్తున్నంతవరకు అవి ఈ క్రింది విధంగా వున్నాయి:

'డాక్టర్ జివాగో' నవల రాసి సోవియట్ పౌరుడుగా కొనసాగటం సాధ్యమేనని నేను నమ్ముతున్నాను. ఎందుకంటే, ముఖ్యంగా అది డూడిన్‌స్తెవ్ పుస్తకం 'NOT BY BREAD ALONE' అచ్చయిన కాలంలో పూర్తయ్యి బయటికి వచ్చింది కాబట్టి. నా నవలని ఒక ఇటాలియన్ కమ్యూనిస్టు పార్టీ

ప్రచురణ సంస్థకి ఇచ్చి మాస్కోలో సెన్సారు చేయబడిన ప్రతి అచ్చు కోసం ఎదురుచూస్తున్నాను. అందులో ఆమోదం కాని విషయాలను తొలగించటానికి నేను సిద్ధంగా వున్నాను. సోవియట్ రచయితకి ఒక మంచి అవకాశం ఇవ్వబడుతుందని నేను వూహించాను. నవలని ప్రచురణకర్తకి ఇస్తూ, విమర్శకులు దాన్ని స్నేహ పూర్వకంగా ఆదరిస్తారని వూహించాను.

నోబెల్ కమిటీకి కృతజ్ఞతా పూర్వకంగా టెలిగ్రాం పంపుతూ బహుమతి నా నవలకి ఇవ్వబడిందిగా నేను భావించలేదు. మొత్తం రష్యన్ సాహిత్యానికి ఇవ్వబడిందని భావించాను. ఆ విధంగా అనుకోవటానికి నా కారణాలు నాకు వున్నాయి. ఎందుకంటే నా పేరు ప్రతిపాదించబడే నాటికి ఆ నవల నేను రాయలేదు. దాన్ని గురించి ఎవరికీ తెలియదు.

ఒక ఆధునిక రచయితని, సోవియట్ రచయితని అయిన నన్ను ఏ శక్తీ నాకు ఇవ్వబడ్డ ఆ గౌరవాన్ని తిరస్కరించేటట్టు చేయలేదు. బహుమతివల్ల వచ్చే డబ్బు శాంతి సంఘానికి ఇవ్వటానికి నేను సిద్ధంగా వున్నాను.

ప్రజల వత్తిడి నన్ను రచయితల సంఘంనుండి బహిష్కరించటం గురించి మిమ్మల్ని ఆలోచించేటట్టు చేస్తుందని నాకు తెలుసు. మీ నుండి నాకు న్యాయం జరుగుతుందని నేను వూహించను. మీరు నన్ను కాల్చివేయవచ్చు. దేశంనుండి బహిష్కరించవచ్చు. మీ ఇష్టం వచ్చినట్లు చేయండి. ముందుగానే మిమ్మల్ని క్షమిస్తున్నాను. నేను ఏ హడావుడి చెయ్యను. ఇది మీకు అదనపు ఆనందం కాని, కీర్తికాని ఇవ్వదు.''

పాస్టర్‌నాక్ యొక్క స్వంత నిర్ణయం పత్రికలనుండి వచ్చిన అవమానాలు, బెదిరింపులు భరించేట్టు చేసింది. నేను ఏమయిన ఇబ్బందులకి గురవుతున్నానా? యూనివర్సిటీలో వున్న లియోనిద్ ఏమయిన బాధలకి గురవుతున్నాడా? అనే విషయమే ఆయనకి కేంద్ర సమస్య అయింది. అతనిలో ఆత్మ స్థైర్యం కలిగించటానికి మేము చేయగల్గినదంతా చేశాము. ఏహ్రెన్‌బర్గ్ ద్వారా నాన్నని సమర్థిస్తూ పశ్చిమ దిశల నుండి వస్తున్న వార్తలని తెలుసుకుని నాన్నకి తెలియజేశాను.

ఈ విషయాలు అతనికి ఆసక్తి కలిగించలేదు. అక్టోబర్ 29న మాస్కో వచ్చి, ఓల్గా ఇవిన్ స్కయాతో టెలిఫోన్లో మాట్లాడి పోస్టాఫీస్ కెళ్ళి స్టాక్ హోంకి ఈ విధంగా టెలిగ్రాం ఇచ్చాడు – ''నేనుంటున్న సమాజంలో ఈ బహుమతికి అంటగట్టిన ప్రాముఖ్యాన్ని దృష్టిలో పెట్టుకొని ఈ బహుమతిని వదులుకోక తప్పటం లేదు. స్వచ్ఛందంగా నేను చేస్తున్న తిరస్కారాన్ని అవమానపరచటంగా భావించవద్దని ప్రార్థిస్తున్నాను.'' ''నేను బహుమతి తిరస్కరించాను, ఇవిన్‌స్కయాకి ఆమె వుద్యోగం ఇవ్వండి'' అనే ఇంకొక టెలిగ్రాం సెంట్రల్ కమిటీకి పంపాడు.

పెరిడెల్‌కినో దగ్గరకి ఆ సాయంత్రం నేను తిరిగివచ్చినపుడు అక్కడ నాన్నని నేను గుర్తుపట్టలేక పోయాను. పాలిపోయిన ముఖం, లోపలికి పోయిన కళ్ళు, నేను ఏమన్నా ఒకటే సమాధానం – ''ఇంకే గొడవా వుండదు. నేను బహుమతిని తిరస్కరించాను''.

ఈ త్యాగాన్ని ఎవరూ ఆశించలేదు. కనీసం అది తన పరిస్థితి కూడ మార్చలేదు. ఆ తరువాత రెండు రోజులకి జరిగిన రచయితల సమావేశంలో అందరూ దాన్ని గురించి పట్ట నట్టువున్నారు. మాస్కో రచయితలు పాస్టర్‌నాక్ పౌరసత్వం రద్దుచేసి దేశం నుండి బహిష్కరించాల్సిందిగా ప్రభుత్వాన్ని కోరారు. జనైడా నికోలెవ్యానా తనతోపాటు దేశం విడిచి రానని చెప్పినందుకు నాన్న చాలా బాధపడ్డాడు. లియెనిద్ కూడా తన తల్లితో వుండాలని నిశ్చయించుకున్నాడు. తాను తన ప్రవాస

జీవితం ఎక్కడ గడిపితే అక్కడికి నేను కూడా తనని అనుసరిస్తానని చెప్పినందుకు నాన్న చాలా ఆనందించాడు. పాస్టర్‌నాక్ రక్షణ కమిటీకి అధిపతిగా వుండటానికి జవహర్‌లాల్ నెహ్రూకి కృశ్చేవ్‌కి మధ్య సంభాషణ జరిగివుండక పోయినట్లయితే పాస్టర్ నాక్ తప్పకుండా ప్రవాసం గడపాల్సి వచ్చేది. ఈ వేడి వాతావరణాన్ని ఆపటానికి 'ప్రావ్దా'కి, కృశ్చేవ్‌కి పాస్టర్‌నాక్ రాసినట్లు చెప్పబడ్డ రెండు లేఖల మీద సంతకాలు చేయమని అధికారులు పాస్టర్‌నాక్‌ని కోరారు. ఆ లేఖల్లో ఏముంది – పశ్చాత్తాపమా, నమ్మిన దానికి కట్టుబడి వుండటమా – అసలు విషయం ఆ లేఖలు పాస్టర్‌నాక్ రాయకపోవటం. అనవసరమైన ఈ ఒత్తిడి ఆయనని చాలా బాధకి గురిచేసింది.

ఇదంతా గతం. ఇప్పుడు నేను 1958లో మా నాన్న వున్న వయస్సులో వున్నాను. 1989, డిసెంబర్ 1న, మాస్కో ఫైన్ ఆర్ట్స్ మ్యూజియంలో "పాస్టర్‌నాక్ ప్రపంచం" అనే ప్రదర్శన ఏర్పాటు చేయబడ్డది. స్వీడన్ రాయబారి బెర్నర్ అక్కడికి నోబెల్ బహుమతి పతకం తీసుకువచ్చాడు. 1989 నోబెల్ బహుమతి గ్రహీతలతోపాటు అది ఇవ్వబడుతుందని ప్రకటించాడు. ఆ ఉత్సవానికి నేను హాజరు కావాలని బెర్నర్ కోరిక. దానికి సంబంధించిన ఏర్పాట్లు, నోబెల్ కమిటీ అనుమతి సంపాదించటం మొదలయినవి ఆయనే చేశాడు. స్వీడన్ రాయబార కార్యాలయం, సాంస్కృతిక మంత్రిత్వశాఖ సహాయంతో ప్రయాణానికి కావలసిన ఏర్పాట్లన్నీ చేసింది. డిసెంబర్ 7న నేనూ, నా భార్య కలిసి క్రిస్టమస్ గంటలు అలంకరించిన విమానంలో స్టాక్‌హోం వెళ్ళాం.

ఒకరోజు తరువాత అంటే డిసెంబర్ 9, 1989న జరిగిన ఒక కార్యక్రమంలో వివిధ బహుమతి గ్రహీతల, స్వీడన్, రష్యన్ రాయబారుల సమక్షంలో అకాడమి సెక్రటరీ స్టూరీ అల్లెన్, పాస్టర్‌నాక్‌కి ఇవ్వబడ్డ నోబెల్ బహుమతి పతకం నాకు అందజేశాడు. అక్కడ ఆయన 1958 అక్టోబర్ 27న, 29న నోబెల్ కమిటీకి పంపిన టెలిగ్రాములు చదివి, విపరీతమయిన ఒత్తిళ్ళ వలన పాస్టర్‌నాక్ అప్పుడు బహుమతి తిరస్కరించాడని, ఇప్పుడు 31 సంవత్సరాల తరువాత, ఆయన లేనందున చింతిస్తూ, ఆ బహుమతిని ఆయన కుమారుడికి అందజేస్తున్నట్లు ప్రకటించాడు. అది ఒక చారిత్రాత్మక సంఘటనగా కూడ ఆయన అభివర్ణించాడు.

నా సమాధానంలో నేను స్వీడిష్ అకాడమికి, నోబెల్ కమిటీకి, వాళ్ళ నిర్ణయంపట్ల కృతజ్ఞతలు తెలియజేస్తూ ఈ బహుమతి దుఃఖపూరితమైన ఆనందంతో స్వీకరిస్తున్నట్లు చెప్పాను. ఎందువల్లనంటే తనకి ఒంటరితనం నుండి, వేధింపుల నుండి విముక్తి కలిగిస్తుందని తాను భావించిన ఈ బహుమతి కొత్త బాధలకి, కారణం అయింది. అది తన జీవిత చరమాంకంలో 18 నెలలని విషాద పూరితం చేసింది. అది తనని బహుమతి తిరస్కరించేటట్లు, ప్రభుత్వానికి విన్నపాలు రాసుకునేటట్లు ఒత్తిడి తెచ్చింది. ఈ అవమాన భారం తనని తన అంతిమ ఘడియం దాకా వెంటాడింది. బహుమతివల్ల వచ్చే డబ్బుకి ఆయన ఏ మాత్రం విలువ ఇవ్వలేదు. ఆ బహుమతివల్ల ఇప్పుడు ఆయనకి లభిస్తున్న గౌరవాన్ని మాత్రమే ఆయన బ్రతికి వుండగా కోరుకున్నాడు.

**మూలం: యూజినీ పాస్టర్‌నాక్** **అనువాదం: బి. తిరుపతిరావు**



**బోరిస్ పాస్టర్ నాక్ 1890 – 1960**

★ ★ ★

(ఇంటర్వ్యూ ఊహాజనితం)

# రామలింగారెడ్డితో మధురవాణి

- పురాణం సుబ్రహ్మణ్యశర్మ

**దువ్వెనతో సి.ఆర్.రెడ్డి తల మధురవాణి దువ్వుతూ -**

**మధురవాణి :** ఏమి ఘుమ ఘుమ (తల మర్దు పెట్టుకొనును) రెడ్డిగారు మైసూరులో రసికత్వం వెళ్ళబెట్టగా - ఏదో జరిగిందట.

**సి.ఆర్. రెడ్డి :** నీతల నాతలకు చేరిస్తే ఏమి ఘుమ ఘుమలు - ఏదీ రిస్కు లేకుండా వుండదు. రాజులతో స్నేహం కత్తిపై సాములాంటిది.

**మధురవాణి :** ఆ మూర్ఖులు తెలీక ఏమన్నాచేస్తే - ఆంధ్రదేశం ప్రముఖ విద్యావేత్తను కోల్పోయేదని కదా అని నావిచారం.

**సి.ఆర్. రెడ్డి :** ఆ విషయాలు యిప్పుడు అప్రస్తుతం.

**మధురవాణి :** మరేది ముఖ్యం? మీలో కవిత్వం ధార చిన్నప్పుడు పొంగి పెద్దయ్యాక పాలిట్రిక్స్‌లో పడి, విద్యావేత్తగా నలిగిన మీదట యింకిపోయింది.

**సి.ఆర్. రెడ్డి :** నాలో కవికుండవలసిన ఇన్నోసెన్స్ నశించి అలా జరిగి వుండొచ్చు.

**మధురవాణి :** మీ మేధ మీ సృజనాత్మక శక్తిని జుర్రేసింది. మీలో అమాయకత్వమే కాదు కవులకు సహజంగా వుండే సెన్స్ ఆఫ్ వండర్ కూడా తగ్గిందా?.

**సి.ఆర్. రెడ్డి :** ఇంగ్లీషు దంచేస్తున్నావ్. ఎక్కడ పట్టావేమిటి?

**మధురవాణి :** డిప్టీ కలెక్టరు గారి పిల్లలకి చదువు చెప్పేముందు గిరీశంగారు నామీద ఇంగ్లీషు ప్రాక్టీసు చేసేవారు. కరటకశాస్త్రి గారివద్ద సంస్కృతం నేర్చుకున్నా. మీ వద్ద తమిళం నేర్చుకోవాలనుంది.

**సి.ఆర్. రెడ్డి :** మైసూరు వచ్చి వుంటే నీకు అర్థశాస్త్రం బోధించి వుండే వాడ్ని. అక్కడ నేనిచ్చిన లెక్చర్లన్నీ భారత అర్థశాస్త్రము కింద సంపుటీకరించాం.

**మధురవాణి :** నాకు అర్థంతో పనిగాని అర్థశాస్త్రంతో కాదు.

**సి.ఆర్. రెడ్డి :** నా అర్థశాస్త్రం నాటి సామాజిక సాంఘిక పరిస్థితుల మీద నేను చేసిన వ్యక్తిగత విమర్శ కూడా. పురుషార్థాల్లో అర్థాన్ని తక్కువగా చూశారు మన వాళ్ళు అది నాకు గిట్టదు.

**మధురవాణి :** నాకు అసలే గిట్టదు. ధన మూల మిదం జగత్ అని మనవాళ్ళేగా అన్నది.

సి.ఆర్. రెడ్డి: సంపద అంతా అక్రమార్జనే అంటే నేను ఒప్పుకోను. ధనం న్యాయంగా సంపాదించి సక్రమంగా కర్చుపెట్టి అనుభవించవచ్చు.

మధురవాణి : ఆస్తి అనేది దోపిడీ వల్ల లభించినది అని మార్క్సిస్టులు అంటార్ట శ్రీ శ్రీ గారు చెప్పగా విన్నాను. మీరేమంటారు?

సి.ఆర్. రెడ్డి: దోపిడీ వల్ల సంపద ఏర్పడుతుంది అంటే నేను ఒప్పుకుంటానా? అర్థాన్ని సాధించకుండా ధర్మాన్ని ఎలా సాధిస్తారు? నిజాయితీగా వుండి డబ్బు సంపాదించవచ్చు కోటీశ్వరులు కాలేకపోయినా.

మధురవాణి : నిధి చాలా సుఖము, రాముని సన్నిధి సేవ సుఖమా అంటారు త్యాగయ్యను తిరగేసి మీరు.

సి.ఆర్. రెడ్డి: మా బాగా అన్నావు. మోక్షము, పరచింత ఎక్కువై మనజాతి నిర్వీర్యమై పోయింది చాలా మటుకు.

మధురవాణి : మీకంటే ముందే గురజాడ అప్పారావుగారు అస్మద్ సృష్టికర్త, 'దేశమును ప్రేమించుమన్నా' అనే ముత్యాలసరాల్లో యివన్నీ చెప్పి 'మంచిగతమున కొంచెమేనోయ్' అన్నారు.

సి.ఆర్. రెడ్డి: అష్లో! అప్పారావు గారి లాంటి ఆధునిక దృక్పథం గల మహాపురుషుడు మా వైపు జన్మించి వుంటే -

మధురవాణి : భారతాలు రామాయణాలు ప్రబంధాలు అటువంటి కవిత్వాలు రాసుకుని విర్రవీగే పండిత కవులుగాక చలం, కుటుంబరావు, గోపీచంద్ వంటి ఆధునిక రచయితలుకూడా నిండుగా వుండే వారు.

సి.ఆర్. రెడ్డి: అంటే మేమంతా వట్టి రామాయణం భారతం గాళ్ళమనా నీ చులకన -

మధురవాణి : పప్పుతోబాటు చారు కూడా వున్నట్లు దానితోపాటు యిది కూడా వుండేదని నా ఆశ. మీ రెక్కడ మీ పాండిత్యమెక్కడ? యింగ్లీషు చదువులు యింగ్లండు వెళ్ళి చదువుకున్నా , మీరు మాత్రం చెక్కు చెదరలేదు. కవిత్వతత్వ విచారం గొప్పగ్రంధం? కాని కళా పుర్ణోదయం కావ్యానికి ప్రాముఖ్యత తెచ్చినపేరు మీకే దక్కుతుంది.

సి.ఆర్. రెడ్డి: అయినప్పటికి కళాపూర్ణోదయం షష్ఠాశ్వాసంలో 189వ పద్యం వరకు వున్నంత ప్రౌఢంగా తరువాతి భాగాలు లేవన్నాను. ఈ గ్రంథమంతటితో పూర్తి చేస్తే బావుండేదన్నాను. ఏడవ ఎనిమిదవ ఆశ్వాసాల్లో భావనాశక్తి, ప్రతిభ బలహీనాలని నా నిర్ణయం చెప్పాను.

మధురవాణి : కృష్ణారావుగారు మీతో ఏకీభవించలేదు. కవిత్వంలో రమణీయ వర్ణనలు ముఖ్యాంగాలని ప్రపంచ మంతటా విమర్శకులంతా అంగీకరించినట్టిదే. అవి షష్ఠాశ్వాసం తర్వాత వున్నవట. రెడ్డిగారూ No purpose will be surved by viewing artistic creations with the bias of the modern age.

సి.ఆర్. రెడ్డి: ఎంత మాట అన్నావు? మల్లాది సూర్యనారాయణశాస్త్రి గారు కూడా 192వ

పద్యంతో కళాపూర్ణోదయ కథ సమాప్తము - తక్కిన భాగాన్ని మధురలాలసా పరిణయం అనో కళాపూర్ణ విజయమనో పిలవవచ్చునని అభిప్రాయపడ్డారు.

మధురవాణి : ముఖ్యంగా మీరు కళాపూర్ణోదయంలో ఏవి దోషాలని చెప్పారో అవి గుణాలే అని కృష్ణారావుగారు సోపపత్తికంగా రుజావు చేశారు. కథా ప్రధానమయిన కావ్యంగా గాక, మహోత్తమమయిన కళాసృష్టిగా ఆ కావ్యాన్ని పరిగణిస్తే తప్ప యీ రహస్యాలు అర్థం కావు.

సి.ఆర్. రెడ్డి నీవనేది, నేను సరిగా అర్థం చేసుకోలేదన్న మాట కలాపూర్ణోదయం

మధురవాణి : అలా ఎందుకంటారు. మీరు పాశ్చాత్య విమర్శకుల దృష్టితో చూసి వుంటారు. అందువలన తేడా వచ్చి వుంటుంది.

సి.ఆర్. రెడ్డి: అదేదో స్పష్టంగా చెప్పరాదా - వింటాను. వినదగు నెవ్వరు చెప్పిన అన్నాడు సుమతీశతకకారుడు.

మధురవాణి : సో! వినండి. పురోహితుడు కళాపూర్ణునితో మాట్లాడిన తీరు, యుద్ధ దృశ్యాలు, స్వగృహోన్ముఖులయిన సైనికుల మనః ప్రవృత్తి సరసంగా సూరన గారు వర్ణించారు. కారణం ఏదైనా స్వల్పకారణాలకే యుద్ధాలు సంభవిస్తాయి. దండయాత్రలు చేయడం రాజనీతి. రాజులు దండయాత్రలు చేయక తప్పదు. సత్త్వదాత్ముడు కళాపూర్ణునికి రాజనీతి సవినయంగా వుపదేశించుట సహజం.

సి.ఆర్. రెడ్డి: మరి మధురలాలస గొడవో -

మధురవాణి : మధురలాలస శిశువుగా పెక్కు కథలు చెప్పి, మణిహారం ఎప్పుడయితే రొమ్మునుంచి తప్పుకుందో అప్పుడు యేమీ కథలుగా చెప్పలేకపోతుంది.

సి.ఆర్. రెడ్డి: అందుకనే ఆ భాగం బోరింగా వుండి వద్దనుకున్నాము.

మధురవాణి : అది మీ ఇంప్రెషన్స్. పాఠకుడికి తెలియాల్సిన విషయాలు వుండిపోయాయి. వాటిలో సుగ్రుహుని కథ ముఖ్యం. శిశువు కథలు ఎలా చెప్పగలిగింది? చెపుతూ చెపుతూ మధ్యలో ఎందుకు ఆగిపోయింది? దీనికి కారణం ఏమిటి? మృగేంద్రవాహనాలయంలో మణికంధరుడేల తన వీణను భద్రంగా దాచాడు? ఈ ప్రశ్నలన్నిటికీ సమాధానం షష్ఠాశ్వాసం తరువాతగాని లభించదు. అందుచేత యీ భాగం ప్రధాన కథతో విడరాని చిక్కని పొత్తు కలిగివుంది.

సి.ఆర్. రెడ్డి: ఇదంతా నాకు తెలియలేదనా? ఈ మాత్రం గ్రహించలేని మూర్ఖుణ్ణా నేను?

మధురవాణి : తమరు సరసులు సహృదయులు. ఆగ్రహిస్తే తట్టుకోగలమా?

సి.ఆర్. రెడ్డి: కృష్ణారావు తెలివిగా సమర్థించిన వాటిని నేను కవిత్వ మూలశక్తులు బలహీనపడ్డంగా భావించాను. దానికంత గింజుకోవాలా?

మధురవాణి : ఎనిమిదవ ఆశ్వాసంలో లక్ష్మీనారాయణ సంవాదం వుంది. అది నిష్ప్రయోజన మని మీరన్నారు. కృతిపతి మెప్పుకై స్వార్థంతో రాసినదని యితరులన్నారు.

సి.ఆర్. రెడ్డి: అవును. అలాగే కనపడింది.

మధురవాణి : సూరన విశిష్టాద్వైత మతాన్ననుసరించి కళావిర్భావ విధానాన్ని వర్ణించాడని జి.వి. కృష్ణారావు ప్రతిపాదన. మీరు కాదన్నా -

సి.ఆర్. రెడ్డి: అది కూడా ఊహగాని వాస్తవం కాదు గదా!

మధురవాణి : Whatever may be the draw backs of ancient Telugu Poets, they can never be charged with obscurity like Spenser, Browning and others. అన్నట్లు కళాపూర్ణోదయం కథంతా వరసగా ఎక్కడా తప్పులేకుండా చెప్పిన వారికి ఏదో బహుమానం ఆంధ్ర విశ్వవిద్యాలయం ప్రకటించినట్లు విన్నాను. అది ఎవరు గెల్చుకున్నారు?

సి.ఆర్. రెడ్డి: ఎవరూ గెలుచుకోలేదు.

మధురవాణి : మరి యీ రిజర్వేషన్లు, దళితుల్ని పైకి తీసుకురావడం, కులప్రాతిపదికమీద ప్రమోషన్లు యివన్నీ ఏమిటి?

సి.ఆర్. రెడ్డి: కులతత్వమే పోవాలంటుంటే మళ్ళీ అట్టడుగు కులాలు బడుగు కులాలు అంటూ లెక్కలేమిటి? నాన్సెన్స్!

మధురవాణి : అలా అయితే అడుగున వున్న వాళ్ళు అడుగునే వుంటారు. మీ అగ్ర కులాల వాళ్ళు పైనెక్కి పెత్తనం చలాయిస్తూ వుంటారు శాశ్వతంగా అదెట్లా సబబు?

సి.ఆర్. రెడ్డి: వెనుకబడినతనం ఒక హక్కుగా ఒక లాభసాటి వ్యవహారంగా పరిగణిస్తూంటే ఎలాగ? చదువుల్లో, ఉద్యోగాల్లో ప్రోత్సాహకాలిచ్చి సహాయం చేయాలి గాని అడుగడుగునా క్రేన్లు బిగించి మీదకు లాగకూడదు.

మధురవాణి : అడుగునున్న వాళ్ళు పైకి రావడం అంటే పైనున్న వాళ్ళు అడుక్కు వెళ్ళటం కాదు గదా!

సి.ఆర్. రెడ్డి: ఒక్కమారు వున్నట్లుండి పదవులూ ఉద్యోగాలూ ఆక్రమించడం వలన సాంఘిక న్యాయం జరిగినట్లు అవుతుందా? అలా ద్వేషాలు క్రోధంతో పదవులు ఆక్రమించిన వారు సాంఘిక న్యాయం సమకూర్చగలరా? ఇదంతా కొరివితో తలగోక్కున్నట్లవుతుంది. చివరకు గవర్నమెంటు వలన పరిపాలన, మొత్తం సంఘం వలన సాంఘిక న్యాయం జరగాల్సివుంది. రిజర్వేషన్లు కోటాలతో సమసమాజం ఏర్పడుతుందా? కల్ల!

మధురవాణి : మన హిందూ సమాజం పతన మవడానికి, యూరపియన్ సమాజంతో పోల్చిచూస్తే అభివృద్ధి చెందకపోవడానికి మీరు చెప్పే కారణాలు వినవచ్చా?

సి.ఆర్. రెడ్డి: ఒకే కులంలో గాని ఒకే తెగ శాఖలోకాని పెండ్లిళ్ళు జరగడం వలన ఆ జాతి దుర్బలం అవుతుంది. మచ్చుకి మన మేనరికాలు - నిజంగా నిషేధించాలి. భిన్న భిన్న కులాల మధ్య జాతుల మధ్య వివాహాల్లో లాభాలు చాలా వున్నాయి. తరవాత బాల్య వివాహాలు జరపకూడదు. ఇందువలన బాలవితంతువులు పుట్టుకొస్తున్నారు.

మధురవాణి : అన్నిటికంటే ప్రమాదకరం, మన ఐక్యతకు భంగకరం మన తగూ లన్నిటికీ మూల కారణం హిందూ సమాజం కులాలుగా విభజింపబడటం అంటా న్నేను. కులవృత్తులు నాశన మయ్యాయి గాని కులాలున్నాయి.

సి.ఆర్. రెడ్డి: అసలు మనవాళ్ళకు పనిచేసి బతకడం మీద చిన్నచూపు. కర్మ కర్మను కోవడం మరొకటి. సాంఘిక దుబారాలు - అందులో ముఖ్యమైనది, సమిష్టి కుటుంబం. ఒకడు సంపాదించటం పదిమంది తింటూ కూర్చోడం జాయింట్ ఫామిలీ విధానంలో కొన్ని రక్షణలు జబ్బు చేయడం అసమర్థత వంటి వాటికి ఒక కాపులాగ పనిచేస్తుంది. ఐనప్పటికీ పనిచేయని వాళ్ళు పదిమంది - ఎలా బాగుపడుతుంది మన సమాజం?

మధురవాణి : మన సమాజంలో మరొకటి వుంది దుర్గుణం. యాచన, భిక్షుక వృత్తి మీద కొన్ని కులాలకు కులాలే పనిచేయకుండా బతికేస్తున్నాయ్.

సి.ఆర్. రెడ్డి: దానం అనే దానిని పొగిడి పెద్ద సుగుణం చేశారు మనవాళ్ళు. ఇతరుల శ్రమమీద పడి బతకడం అదో పర్యాయ అయింది. శంకరుడే ఆది భిక్షువు.

మధురవాణి : ఈ సాంఘిక రుగ్మతలకి మీరేమి ఔషధం సూచించారు?

సి.ఆర్. రెడ్డి: మూడు చెప్పాను. అన్ని రంగాలలోను ప్రముఖంగా వ్యక్తులు ఉత్సాహంగా వ్యాపారాలు నడపాలి. సంస్థల్ని నిర్వహించాలి. పెద్దఎత్తున పరిశ్రమలు దేశమంతటా నెలకొల్పాలి. సహకార సంఘాల ద్వారా ఉత్పత్తుల్ని సాగించి పంపిణీ నిర్వహించాలి.

మధురవాణి : ఇవి అన్నీ కూడా యిప్పుడు ప్లానుల ద్వారా మనవాళ్ళు చేశారు, చేస్తున్నారు. కాని, రాజకీయాల్లో కులాల్ని మతాల్ని వాడుకోవడం వలన, రవుడీయిజం గుండాయిజం అంతా చేరదీయడం వలన, పరిస్థితులు తారుమారయాయి. దీనికంతటికీ ఎలక్షన్లే కారణమా?

సి.ఆర్. రెడ్డి: గుడ్ ! యీనాటి పరిస్థితుల్ని బాగా చెప్పావు. హాస్య రచయితలకి వ్యంగ్య రచయితలకు ముడి వస్తువుగా వుపయోగించే పరిస్థితుల్లోకి నెట్టారు రాజ కీయ నాయకులు మన సంఘాన్ని.

మధురవాణి : నన్నయ్యగారి వచనాన్ని చిన్నయసూరి వచనాన్ని మెచ్చుకున్న మీరు కనీసం మాలపల్లి చదవలేదు, వేయిపడగలు చదివారో లేదో తెలీదు. కుటుంబరావు, గోపీచంద్, చలం మీ కంటికే ఆనరు. మీరేమి సాహిత్యకారులండీ, చెళ్ళపిళ్ళ వారి కున్న లిబరల్ దృక్పథం కూడా మీకున్నట్లు కనపడదు -

సి.ఆర్. రెడ్డి: నేను పాత కొత్తల మేలు కలయిక కాలేక పోయాననా నీ ఝూడింపు? నా పుట్టుక పెంపకం నా చుట్టూ వున్న వాతావరణం, నా విద్యాభ్యాసం అట్లాటివి. మనవాళ్ళు పురాణ పురుషుల కిచ్చినంత గౌరవం గుర్తింపు చారిత్రక వ్యక్తులకి యిచ్చేవారు కాదు. గతం మీద గౌరవం మంచిదే - అందులోనే కూరుకుపో కూడదు.

**మధురవాణి :** గతమంతా తడిసె నెత్తురున, కాకుంటే కన్నీళులతో అన్నాడు యుగకవి. అన్నట్లు శ్రీ శ్రీ అనే కవిని గూర్చి విన్నారా మీరు? పింగళి సూరన, నన్నెచోడుడు అక్కడే ఆగిపోయారా ?

**సి.ఆర్. రెడ్డి :** 1910లో హైలీ తోకచుక్క వచ్చినపుడు పుట్టాడ్ట వాడా? నా కంటికి ఆనడు. అవును. పింగళి సూరన, నన్నెచోడుడు అంటూ వేళాకోళంగా మాట్లాడుతు న్నావు. ఏమిటి నీ ఉద్దేశం ?

**మధురవాణి :** నాకు వారి పట్ల భక్తి గౌరవాలు లేక కాదు. ఇంగ్లండు వెళ్ళొచ్చి విక్టోరియా - ఎడ్వర్డ్ కాలంలో వున్న విలువల్తో మిమ్మల్ని చూస్తే నవ్వు ఆగక - బోల్షివిక్ విప్లవానికి లీసిజ్ ఫిరీకి ముందుండి పోయారు. రినైజాన్స్, ఇండస్ట్రియల్ రివల్యూషన్ వలన కలిగిన మార్పులు మీకు తెలియవా? ఆ వాసనే మీలో లేదే.

**సి.ఆర్. రెడ్డి :** పెద్ద ఇంగ్లండు వెళ్ళొచ్చినట్లు నన్నే నీవు నిలదీస్తున్నావే -

**మధురవాణి :** విబుధజనుల వలన విన్నంత కన్నంత.

**సి.ఆర్. రెడ్డి :** మాది స్వచ్ఛమైన రెడ్డి వంశము. రాజసం మారక్తంలో వుంది. రాజ్యాలు ఏలే హక్కు వుంది. నీవో విజయనగరంలో గడవక రామప్పంతులుతో కృష్ణరాయపురం అగ్రహారానికి మకాం మార్చిన దేవదాసివి. సిద్ధాంతి, గురయసెట్టి, హెడ్ కానిస్టేబులు వీరందరితో పేకాడే దానివి. నాకు కోపం వస్తే నీ ఇంటర్వ్యూ కాన్సిల్ చేస్తాను జాగ్రత్త!

**మధురవాణి :** చేయలేరు. చెయ్యరు.

**సి.ఆర్. రెడ్డి :** ఎందుచేత ?

**మధురవాణి :** నేను తప్ప యిప్పుడు మిమ్మల్ని తలుచుకునే వాళ్ళే లేరు. (నవ్వు)

**సి.ఆర్. రెడ్డి :** కాదు. నీ మత్తు కలిగించే నవ్వు చూచి తగ్గాను.

**మధురవాణి :** మీ మధ్య పాపిడి, వుంగరాల జుత్తు, సొగసైన మీసకట్టు చూసి, చలించాననుకుంటున్నారా ?

**సి.ఆర్. రెడ్డి :** నా పర్సనాలిటీ నిన్ను ఆకట్టుకోబట్టే నువ్విన్ని చమత్కారపు మాటలాడుతున్నావు సరసాలాడుతున్నావు.

**మధురవాణి :** జీవించడం ఒక కళ అంటారు గదా - అలా కళాత్మకంగా జీవించాలంటే మీరిచ్చే సూచన లేమిటి?

**సి.ఆర్. రెడ్డి :** అలా జీవించాలని ఎవరూ కోరుకోరు. ఒకవేళ కోరుకుంటే - ప్రకృతి నియమాలు బాగా వంట పట్టించుకోవాలి. ప్రకృతి నియమాల్ని ఆచరించడం ఎలాగో తెలియాలి. తరువాత విచక్షణా జ్ఞానం అనేది వుండాలి. దేనికది ఏవిటో తెలుసుకోగల హేతువాద దృక్పథం వుండాలి. దాన్తోపాటే న్యాయ నిర్ణయం చేయగల శక్తి వుండాలి. అన్నిటికంటె అవసరమైతే శారీరక శ్రమ చేయకలిగి వుండాలి కూడా.

**మధురవాణి :** మరి మన పెద్ద చదువు లెలా వున్నాయంటారు?

**సి.ఆర్. రెడ్డి:** మన యూనివర్సిటీలు గతకాలపు శోభని కీర్తించేవిగా మిగిలిపోయాయి.

**మధురవాణి :** అంటే పాత గొప్పలు తవ్వుకుంటూ -

**సి.ఆర్. రెడ్డి:** అవును. జ్ఞానం జ్ఞానార్జన ముఖ్యమే. మిగతా విలువల్ని నిర్లక్ష్యం చేస్తున్నాయ్ యూనివర్సిటీలు -

**మధురవాణి :** గతం పట్ల కృతజ్ఞతా భావంతో వున్నంత మాత్రాన అభ్యుదయం లభిస్తుందా? వర్తమానం జీవించాలి గాని గతంలో కాదు.

**సి.ఆర్. రెడ్డి:** యూనివర్సిటీ విద్యా విధానాన్ని మార్చాలి. జ్ఞానంతోపాటు నైతిక విలువలను పెంచాలి.

**మధురవాణి :** మీరు ఘోటక బ్రహ్మచారి అయినా పెళ్ళిళ్ళ గురించి మీరేం చెబుతారో వినాలని వుంది? (నవ్వు)

**సి.ఆర్. రెడ్డి:** కావ్యాలు చదివి ఆలోచించా. స్వయంవరం కూడా ఒక విధమైన రాక్షస వివాహమేనని నాకనిపిస్తుంది.

**మధురవాణి :** స్వయంవరం రాక్షసమేమిటి? రాజకుమార్తె తనకు నచ్చిన వరుడి మెడలో వరమాల వేస్తుంది గదా!

**సి.ఆర్. రెడ్డి:** అది కాదు. ఎక్కడయితే శివధనుస్సు నెత్తడం, మత్స్య యంత్రాన్ని కొట్టడం యిట్లాటి పందేలు వుంటాయో అక్కడ పెళ్ళికూతురుకి స్వేచ్ఛ ఏది? పెళ్ళికూతురుకి నచ్చిన వాళ్ళే పోటీలో పాల్గొంటారని నమ్మకం లేదు కదా! తిరస్కరించడానికి వధువుకి హక్కే లేదు.

**మధురవాణి :** దమయంతి స్వయంవరంలో ఆమె నలుణ్ని వలచింది గదా - అక్కడ స్వయంవరం నిజంగా వధువు అభీష్ట ప్రకారం జరిగినట్లే కదా!

**సి.ఆర్. రెడ్డి:** భీష్ముడు కాశీరాజు కుమార్తెలను ముగ్గురిని చెరబట్టలేదా విచిత్రవీర్యుని కోసం. సీత, ద్రౌపది జూదంలో పావులలాంటి వారు కాలేదా? రాక్షస వివాహ పద్ధతి కాలక్రమాన అంతరించింది. దాని ప్రయోజనాలు దానికున్నాయి అనుకో.

**మధురవాణి :** గాంధర్వవిధి గురించి మీరేమంటారు?

**సి.ఆర్. రెడ్డి:** ఈ మంత్ర తంత్రాల వైదిక వివాహ విధులన్నిటికంటె చాలా ప్రాచీనమైనది గాంధర్వం. స్త్రీ పురుషుల సహజ ప్రకృతులకు అనుగుణమైనది. ఉత్తమమైన ప్రేమకు ఉన్నతమైన కలయిక గాంధర్వం.

**మధురవాణి :** మన దేవాలయాల్లో మొక్కులు ముడుపులు గురించి మీ అభిప్రాయం ?

**సి.ఆర్. రెడ్డి:** పూజారిని మధ్యవర్తిని చేసి భగవంతుడు అనగా సృష్టికర్తతో బేరాలాడ్డం నాకు గిట్టదు.

**మధురవాణి :** మీరు ప్రబంధాల్ని చెడతిట్టారు కదా, అన్నీ పనికి మాలినవేనా మీ దృష్టిలో ?

సి.ఆర్. రెడ్డి: రామ! రామ! అన్నీ రొటీన్ కావు. అల్లసాని పెద్దనగారి 'మనుచరిత్ర' రామరాజభూషణుడి 'వసుచరిత్ర', చేమకూర వేంకటకవి 'విజయవిలాసం' పింగలి సూరనగారి 'కలా పూర్ణోదయం', వారిదే 'ప్రభావతీ ప్రద్యుమ్నం?' - యివన్నీ మంచివి, గొప్పవి, నాకు నచ్చినవి.

మధురవాణి : భావ కవితా వుద్యమంలో మీ వైపునుంచి ఒక్కరంటే ఒక్కరు కూడా లేకపోవడం అది సీమ అదృష్టంగా చెప్పాలా? దురదృష్టంగా చెప్పాలా?

సి.ఆర్. రెడ్డి: నా తరవాతి వాళ్ళు నా కంటె బెటరనుకుంటూ. నేనే అందుకోజాలనివి వాళెలా అందుకుంటారు? కొన్ని మొట్టమొదటి పత్రికలు మా వేపునించే పుట్టాయి తెలుసా?

మధురవాణి : మీరు గొప్ప కవి కాలేదు. కాని గొప్ప సాహిత్య విమర్శకుడిగా, మంచి విద్యావేత్తగా మిగిలిపోయారు.

సి.ఆర్. రెడ్డి: నీకు ఎవరెక్కువిష్టం ?

మధురవాణి : పోండి! పోకిరీ మాటలూ - మీరూనూ. బిల్హణీయం మీరు రాసిన దాంట్లో బిల్హణుడు పశ్చాతపపడి తన్ని తాను సవరించుకున్నట్లు రాశారు. మీరు వ్యక్తిగతంగా బిల్హణుడు యామినీపూర్ణ తిలకాన్ని ప్రేమించడం భరించలేక.

సి.ఆర్. రెడ్డి: ప్రేమవల నుంచి బయట పడేసినందుకు ఆమె కృతజ్ఞతగా వున్నట్లు రాశాను.

మధురవాణి : కృతజ్ఞత కాదు ఏమీ కాదు. యామిని మిమ్మల్ని తిట్టి వుంటుంది. గురుశిష్య సంబంధం కన్నా ఎన్నో రెట్లు బలమైనది ప్రేమబంధం. మీకు స్త్రీ ప్రేమని గ్రహించడం కూడా తెలవదు. మీరేం భావుకులండీ?

సి.ఆర్. రెడ్డి: నువ్వు మరోలా అనుకోవని నాకు తెలుసు. నైతిక ప్రమాణాలపట్ల నీకు లెక్క వుండదు.

మధురవాణి : రహస్య ప్రణయాలు సాగిస్తూ దొంగముద్దులూ దొంగకవుగిలింతలూ జుర్రుకుంటూ, దాంపత్యంలో నైతిక ప్రమాణాల గురించి మీరు మాట్లాడటం......

సి.ఆర్. రెడ్డి: కోపం వచ్చి మాట్లాడుతూంటే నీ ముక్కు అదురుతూ కళ్ళుమెరుస్తూ, నడుం కదుల్తూ, ముందుకు రావటానికి పులిలా ఎదురుగుండెలతో నువ్వు మనోహరంగా వుంటావు, రెచ్చినపుడు, అవునా?

మధురవాణి : ఆపండి మీ పొగడ్తలు. మీరు వైస్ ఛాన్సిలర్ గానే బావుంటారు. ఇంకేదీ మీకు నప్పదు. మీగురించి రాచమల్లు రామచంద్రారెడ్డి గారు ఏమన్నారో తెలుసా?

సి.ఆర్. రెడ్డి: ఏమన్నారు?

మధురవాణి : ''కట్టమంచివారు ప్రబంధ కవిత్వాన్ని అంతగా చెడతిట్టిపోయినా, తెలుగుకవిత్వానికి ఒక దారి తెన్ను చూపించలేకపోయారు. తెలుగుకవిత్వానికి ఆయన చేసిన Positive contribution యేమీ లేదు. ప్రబంధ కవిత్వం 19వ శతాబ్దిలోనే చచ్చింది. ఆ శవానికి అంత్యక్రియలు చేసిన ఘనత మాత్రం

# తెలిసే అభినయిస్తున్నారా?

కళాభిమాని

కళాకారుడు సిద్ధాంతానికీ, ప్రయోగానికీ (practice) మధ్య సమతౌల్యాన్ని చక్కగా నిర్వహించాలి. ప్రస్తుతం శాస్త్రీయ ప్రదర్శనల్లో వ్యాపారదృష్టి ప్రబలిపోవడంతో, ఈనాడు మనదేశంలో సిద్ధాంత పక్షాన్ని చాలమటుకు త్రోసి రాజన్నట్లవుతున్నది.

నృత్యం నేర్చుకుంటున్న విద్యార్థులతో ఈ మధ్య ముచ్చటిస్తుండగా, ఈ విషయం బయటపడింది. వారు అభినయిస్తున్నదానికీ, వారు అభ్యసిస్తున్న కళకూ గల తాత్పర్యానికి చాలా తేడా ఉన్నట్లు స్పష్టమయింది. ఆ సందర్భంలోనే సిద్ధాంత పక్షాన్ని వివరించే కొన్ని ఉపన్యాసాలతో కూడిన ఒక పాఠ్యక్రమాన్ని (course) రూపొందించాలనే భావానికి నా మనస్సులో అంకురార్పణ జరిగింది. ఆ తరవాత నేను నృత్యం అభ్యసిస్తున్న విద్యార్థుల ముందు- 'నృత్య కుటీరం' లాంటి సంస్థలలో నృత్యం నేర్చుకుంటున్న విద్యార్థుల ముందు- ఉపన్యాసాలు ఇవ్వడం జరిగింది. అది నాకు ఒక విచిత్రమయిన గొప్ప అనుభవంగా పరిణమించింది. ఎందుకంటే భారతీయ నృత్యంలోని అంతరార్థాలను ఆకళింపు చేసుకున్న ఆ విద్యార్థుల ముఖాలపై ఆనందం తొణికిసలాడడం నాకు ఆశ్చర్య ప్రదంగా తోచింది.

శ్రీ రామలింగారెడ్డికి దక్కింది. ఆ తర్వాత వచ్చిన భావ కవిత్వం దశ ఆయన ఊహకే తట్టలేదు. నిజానికి చారిత్రాత్మకంగా ఆయనది ముందు చూపు కాదు'' (రా.రా.) రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు కూడా యీ పంథాలోనే అన్నారు.

**సి.ఆర్. రెడ్డి:** విద్యారంగంలో రాణించాను కానా? ఆంధ్ర విశ్వవిద్యాలయం నా కృషికి చాలదా? చరిత్రలో మైలురాయి కదా!

**మధురవాణి :** ఆశించినది ఎంతో వుండగా లభించినది స్వల్పం. అసాధారణ ప్రజ్ఞావంతులు ఎంతో సామర్థ్యంకల మీరు జీవితంలో సాధించినది చాలా తక్కువ - మీ గురించి చాలామంది అభిప్రాయం యిదే It is hard to find a life so rich in promise and so poor in performance, so full of aspiration and so little of achievement.

**సి.ఆర్. రెడ్డి:** నీ బొట్లరు ఇంగ్లీషు చదువు ఆపు.

'సిద్ధాంత పక్షపాతిని' అని అనిపించుకోవడం నాకు ఇష్టం లేదు. ఎందుకంటే వర్ణక్రమాలలో ఇమిడి ఉన్న నృత్య సౌందర్యాన్ని అర్థం చేసుకోవడం కేవలం గ్రంథ పఠనం వల్ల సాధ్య పడేది కాదు, శాస్త్రాధ్యయనం మన నడవడి (behaviour) లో మార్పుతేవాలి. నాట్య శాస్త్రాధ్యయనం, సౌందర్య శాస్త్రాధ్యయనం కళాకారుని అభినయ కౌశలాన్ని ఇనుమడింపజేసినపుడే, ఆ అధ్యయనానికి సార్థకత.

ప్రపథమంగా నర్తకుడు ప్రశ్నించడం అలవరచుకోవాలి. నాట్య శాస్త్రాన్నే పరిశీలించండి - ఋషులు నిరంతరం భరతమునిని ప్రశ్నిస్తూనే ఉంటారు. ఆ ప్రశ్నలకు భరతముని ఇచ్చే జవాబులు నాట్య కళలోని అంతరార్థాలను బహిర్గతం చేయడంతో సహకరిస్తూనే ఉంటాయి. మన నాట్య సంప్రదాయా లను తర్క బద్ధంగా, సకారణంగా అర్థం చేసుకుంటే, దూరదృష్టి లేని అభిప్రాయాలకూ, మూఢ విశ్వాసాలకూ తావులేకుండా పోతుంది. పై పెచ్చు మన సంప్రదాయాల పట్ల గట్టి నమ్మకం ఏర్పడుతుంది.

ప్రతి సంవత్సరము వేలాది 'అరంగేట్రాలు' (రంగ పూజలు) నిర్వహించ బడుతున్నాయి. ఆ రంగ పూజల కోసం నృత్య విద్యార్థులు స్కూలు పరీక్షలకు హాజరవుతున్నంతగా, కష్టపడి, భట్టీ పట్టి, తయారవుతారు. నిజమే, రంగస్థలం మీద ఇదివారి ప్రథమ ప్రవేశం. వారు ఏం అభినయించబోతున్నారో అన్నది అర్థం చేసుకోవాలి. నృత్య కళాకారులందరూ దాదాపుగా 'శివతాండవం' అభినయిస్తారు. అయితే, ఏ ఒక్కరినయినా 'శివతాండవ' ప్రాశస్త్యాన్ని గురించి ఐదువాక్యాలు మాట్లాడమనండి. ఊహు, నోరు పెగలదే! శివుని నృత్యాన్ని చచ్చు చూపులతో, జారిపోతున్నట్లున్న అంగ విన్యాసంతో అభినయించడాన్ని చూసి ఆశ్చర్య పడాల్సిందేమీ లేదు.

ఆ శ్లోకంలోని సాహిత్య ధర్మ సంబంధమయిన పృష్ఠభూమిని (background) అర్థం చేసుకోకుండా, అభినయ గాంభీర్యం కావాలంటే ఎలాకుదురుతుంది? మధ్యయుగానికి చెందిన ధార్మిక ఉద్యమాలనూ, సాధు మహాత్ముల జీవితాలను అర్థంచేసుకోకుండా, భక్త్యావేశాన్ని (devotional fervour) అభినయించగ లగడం సాధ్యమా? అలా అయితే (అర్థం చేసుకోక పోతే) ఆభక్తి కథలు, ఆవ్యక్తులు కొయ్య చిత్రాలయి పోతాయి.

సువిఖ్యాతులయిన నృత్య కళాకారులు శాస్త్రాన్ని అధ్యయనం చేసి ఉంటారనీ, నృత్యానికి సంబంధిం చిన రసాదులను, వాటి వికాస క్రమ సిద్ధాంతాలను, ఉద్యమాల అర్థతాత్పర్యాలను, శుద్ధ (pure) నాట్యంలోని అంగాంగాభినయాలను హృదయంగమం చేసుకొని ఉంటారని ఎవరైనా అభిప్రాయ పడవచ్చు. అయితే సర్వ సాధారణంగా, కొద్దిమందికే అందుబాటులో ఉండే వృత్తి (professional) కోర్సులకు కాకుండా, ఈ కళారూపం (నృత్యం) హాబిగా క్లాసులకు వెళ్ళి నేర్చు కోవడం దాకానే పరిమితమయిపోయింది.

అర్థం చేసుకొని నృత్యం చేయగలగడానికి ప్రతివారూ, వృత్తి రీత్యా నర్తకులు (professional dancers) లేదా పరిశోధక విద్యార్థులు కానవసరం లేదు. శాస్త్రాన్ని అర్థం చేసుకోవడం వల్ల సహజత (spontaneity), విలక్షణ మయిన ప్రత్యేకత (intensive identification) నశించి పోతాయని అనుకోవడం భ్రమ. శాస్త్రాధ్యయనం చేయకుండానే నేను గొప్ప వాణ్ణయ్యాను అని గర్వపడడం మరీ తప్పు.

నా అభిప్రాయ ప్రకారం ప్రతినర్తకుడూ తన కళారూపాన్ని, దాని భావాభివ్యక్తీ కరణను గురించి ప్రయోగ పూర్వకమయిన ఉపన్యాసం (demonstration-lecture) ఇవ్వగలిగి ఉండాలి. ఇది అభినయం యొక్క స్థాయిని అభూతపూర్వంగా ఇనుమడింప చేయగలుగుతుంది. ★

# కల - కళ

- కొండిపర్తి శేషగిరిరావు

'కల - కళ'

ఇవిరెండూ నిజమైన అబద్ధాలు. అబద్ధమైన నిజాలు. కల అన్నది నిజం కాని అబద్ధం. కళ అన్నది అబద్ధం కాని నిజం.

'కల' కూ 'కళ'కు మధ్య విభేదము అన్నది ఉన్నది. మరోరకంగా చూస్తే, ఈ రెంటిమధ్యా విభేదము అన్నదే లేదు.

మనిషిలోని ఊహలకూ, ఆవేదనలకూ, తీరని కోరికలకూ, అర్రులు చాచే ఆశయాలకూ ఆదర్శాలకూ, వాటంతటఅవి క్రమరహితంగా ఏర్పడే భావాల రూపకల్పనే కల.

ఈ భావ రూపకల్పన మనిషియొక్క ఇష్టాయిష్టాల ననుసరించి కాకుండా అతని అధోచేతన లోని తీరుతెన్నులనుంచీ, అది మలచి వరవడిపెట్టిన ఆనవాళ్లల్లో నుంచీ పరిగెత్తుకొంటూ పోయే ఓ రూపు కట్టిన భావస్రవంతి లాంటిది కల అన్నది.

మనిషిలోని అభిరుచి అన్నది ఇంకొంచెం ముందుకుపోతే జిజ్ఞాసగా మారుతుంది. అదికూడా ఈ కలయొక్క స్వభావంలోనుంచే మేలుకొంది అని అనిపిస్తుంది. ఒకోసారి మనిషిలోని ఈ అభిరుచులూ, ఆశయాలూ, ఆదర్శాలూ, జ్ఞాన జిజ్ఞాసలూ కలలలో సాగి సాగి అతని అభిధలో జొరబడి తీవ్రతరమై అతని మెళుకువలోకూడా ఊహ అనే కలల రూపాన్ని ధరిస్తుంటాయి. అప్పుడు అవి వాస్తవరూపాన్నో, వాక్యరూపాన్నో ధరించ ప్రయత్నిస్తాయి. అప్పుడు అవి కార్యరూపాలుగానో కళాకృతుల రూపాలుగానో పరిణమి స్తాయి.

'కళ' అన్నది జాగ్రదవస్థలో మానవ మనోయోనిజమైన ఓ అంశ. 'కల' అన్నది మనిషి నిద్రపాన్పుమీద పడుకోగానే అతని అధోచేతనలోని వాకిళ్లను తెరచుకొని, మరోభూమి కలలోకి మానవుని ప్రయాణింపజేసేది.

కల అలా ప్రయాణింపజేస్తుంటే; కళ అన్నది అతని మెళుకువలోనే, అతని అధోచేతనలోని కళాభిరుచులను బయటకులాగి అతనిచేత సుందరమైన ఆవేదనాగతమైన సృష్టిని చేయించే దిగా ఉంటోంది. ఇంకా అతనికి, అతని మెళుకువలోనే అతని అధోచేతనతో ఎన్నో సుందరమైన ఊహలనూ, సుందరసృష్టి ఊహలనూ కల్పిస్తూ, అతనిని రసస్రష్టగా మార్చి రసకృతులను చేసేలా తయారుచేస్తూ ఉంది. సుందర నిర్మాణ కళాస్రష్టయైన ఆ అధోచేతన, మానవుడు రససృష్టి చేస్తూ ఉన్నప్పుడు, అతనిలోని మెళుకువను కూడా అతనితో అధిగమింపజేసి తాదాత్మ్యత అన్న మరోస్థితిలోకి స్వాప్నికస్వభావ లోకంలోకి అతన్ని తీసుకుపోతూ ఉంటుంది.

నిజానికి మానవునిలో కలలు కనే ఈ స్వభావం, సౌందర్యసృష్టి పూర్వాపరాల విషయాలలోనే కాదు ఉన్నది; అతని వైజ్ఞానిక జగత్తులోనూ, అందలి ప్రయోగ పరిధికి ముందు ఉన్న భావసంచయాలలోనూ, ఓ రకమైన భావస్వాప్నిక జగత్తులాంటిదే ఉన్నది. కాకపోతే అది వైజ్ఞానిక స్వాప్నికత.

మానవ సామాజిక శాస్త్రాలలోని ఆర్థిక, పారిశ్రామిక, సాంస్కృతిక, ధార్మిక, నైతిక పరిధులలోని ఆదర్శభావ సంపత్తి అంతా ముందుగా మానవుడు జాగ్రదవస్థలో తనమేధతో కనిన ఓ స్వాప్నిక జగత్తే.

సమాజపరమైన మానవజీవన పరమైన ఎన్నో ఆదర్శాలతో ముడిపడిన ఆలోచనా ధోరణులన్నీ అవి పుట్టినప్పుడు స్వాప్నిక స్వభావం కలిగినవేకానీ అన్యము కాదు. వాటిక్రింద కొన్ని భూమికలు ఉండవచ్చు. అవి కళాజగత్తులోని స్వాప్నికతకి అడుగున ఉన్న కొన్ని రమ్యరస భూమికలు ఉన్నట్లుగా ఉండవచ్చు.

ఆ ఆదర్శభావాలు సమాజంలో వినిమయమై వాస్తవాలైనప్పుడు ఆ స్వాప్నికత యథార్థమౌతుంది. అంతవరకు ఆ ఆదర్శభావాలు కళా జగత్తులోని స్వప్న స్వభావాన్ని కలిగినవిగానే చెలామణి ఔతుంటాయి.

వైజ్ఞానిక జగత్తులోనూ ముందు భావం పుడ్తుంది. ఆ తరువాత కొన్ని ఉపపత్తులను సంతరించుకొంటుంది. ఆ తరువాత ప్రయోగశాలలో ప్రయోగమౌతుంది. ఆ ప్రయోగంలో అది విఫలమైతే ఆ వైజ్ఞానిక ఊహ కలగానే మిగిలిపోతుంది. ఆ వైజ్ఞానిక భావస్వప్నం సఫలమైతే వాస్తవమౌతుంది. తిరిగి దీనినుండి మరో నూతనభావం పుడ్తుంది.

శాస్త్రీయ పరిశోధనాంశాలలో ముందుగా జరిగేది భావసారూప్య స్వాప్నికత. ఆ స్వాప్నికభూమికకు, వైజ్ఞానిక జగత్తులో కళాజగత్తులోలా ఎంతో వైశాల్యం ఉన్నది.

ఇలా జ్ఞాన విజ్ఞాన జగత్తులలో అన్వేషణలలోనీ పరిశోధనలలోనీ ఊహ, మేధోజనితమైన ఓ స్వాప్నికత ఐతే; లలితకళలలోని భావమూ, రసమూ, సౌందర్యమూ అన్నవి, హృదయజనితమైన రమణీయమైన ఓ స్వాప్నికత. ఒకటి మేధోసంబంధి ఐతే, మరొకటి హృదయకోశ సంబంధి.

జ్ఞాన విజ్ఞానాలలో ఉన్న ఊహాజనిత భావ వ్యుత్పత్తి అన్నది స్వాప్నిక స్వభావాన్ని కలిగిఉన్నప్పుడు; ఆనందప్రదమూ స్పందనాత్మకమూ అనుభూతిమయమూఐ, లలితమూ ఐన కళా స్వభావంతో, స్వాప్నికత ఉండటంలో అనౌచిత్యం ఏమాత్రం లేదు అని అనుకోవటంలో పొరబాటులేదు. కాకపోతే జ్ఞాన, విజ్ఞాన జగత్తులలోని స్వాప్నికత శాస్త్రీయ ప్రయోగమైంది ఐతే, కళాజగత్తులోని స్వాప్నికత, సౌందర్య రసప్రయోగాలతో, సుందర సాంకేతిక సౌందర్యంతో కూడింది ఔతూ ఉంది. అందుకని -

కళాసృష్టిలోని భావం రమ్యమైన ఓ కలలాంటిది అని అనటం లలితకళా దృష్టిలో ఔచిత్య ప్రదమేకానీ అవమాన ప్రదమైంది కాదు. పైగా ఈ స్వాప్నికతకు ఆధునిక సాంప్రదాయిక విభేదాలు అన్నవి కూడా లేవు.

ఎంతో వాస్తవ భూమికలమీద నడిచే ఆర్థిక పారిశ్రామిక సాంస్కృతిక, ధార్మిక, నైతిక, సామాజిక శాస్త్రాలలోని భావనా జగత్తూ, జ్ఞాన విజ్ఞానాలలోని భావనావాహినులే, స్వాప్నిక స్వభావం అన్న ఆకాశపు గొడుగు క్రిందకు వచ్చినప్పుడు; రసాత్మకమూ రమణీయాత్మకమూ ఐన కళాసృష్టి పూర్వాపరాలలో ఉన్న భావము స్వాప్నిక స్వభావాన్ని కలిగినది అని అనుకోవటంలో కించిత్ కూడా కించపడవలసిన పనిలేదు.

అందుకనే రసతత్వం అంత మృదుమధురంగా ఉండి మానవ మనస్సుకు సేదతీర్చేదిగా ఉన్నది. దానియొక్క ధ్యేయంకూడా మూడువంతులు అదే.

కళాకారుని జాగ్రదవస్థలో మేలుకోబడిన అధోచేతనలోని ఈ రసస్వాప్నికత, కళాసృష్టిలో అతని దేహంద్వారా చేతి మునివ్రేళ్ల చిగురుకొసల ద్వారా కళాకృతిలో జొరబడి, అందులో కలకాలం నిక్షిప్తమైన శాశ్వత రస శ్వాసియై ఉంటూంది. ఆ కళాకృతి ఎంతదూరంలో ఉన్నా, మన దృక్ శ్రవణేంద్రియాలలోని ఇంద్రియ దృష్టిని దానిపై నిలిపినా నిలపకపోయినా అది తనలోని స్పందననూ తాదాత్మ్య లక్షణాన్ని ఆ ఇంద్రియంమీద ప్రసరింపజేసి, తన రసశ్వాసలోనికి మానవుని తీసుకొనిపోయి, కళాద్రష్టను చేసి రసతాదాత్మ్యునిగా, రసస్వాప్నిక ద్రష్టగా చేస్తూ ఉంటుంది. అందుకనే స్వాప్నిక ద్రష్టకు కల-కళ అన్నవి మధురానుభూతులుగా మిగిలిపోతాయి హృదయంలో.

అందుకనే 'కల-కళ' అన్నవాటికి అనాదిగా ఏ కళా సంస్కృతులలోనూ భేదం కనిపించదు. కనుకనే ప్రాచీన కాలంలో కళ స్థానంలో కల అన్నపదం ఉంటూ వచ్చింది. కళ ప్రకృతి; కల వికృతి.

కాకపోతే, ఒకటి నిద్రపాన్పుమీద అస్తిత్వాన్ని పొందితే; మరొకటి జాగ్రదవస్థలోని రసపూల సెజ్జమీద అస్తిత్వాన్ని పొందుతున్నది. మానవుడిని మెత్తని ఒడిలో కూర్చోబెట్టుకొని చల్లగా బుజ్జగించే మాతృ అస్తిత్వాన్నికూడా పొందుతూ ఉన్నది.

కళా సృష్టిలోని - స్వాప్నికతత్వం

స్వాప్నిక జగత్తులోని - కళాహృదయం

ఈ రసజగత్తులో ★

 

## SYMPTOMS OF NARCISSISM:

Emotionally shallow, fearful of intimacy, primed with pseudo-self-insight, indulging in sexual promiscuity, dreading old age and death, the new narcissist has lost interest in the future. —

**– Christopher Lasch.**

# హాస్య రసము

- చీమకుర్తి శేషగిరిరావు

## రస వివేచన

రసముల ఉత్పత్తిని వివరించుచు, భరతుడు ప్రధాన రసములు నాలుగు (శృంగార, రౌద్ర, వీర, బీభత్సములు) మాత్రమే అనియు తక్కిన నాలుగు (హాస్య, కరుణ, అద్భుత, భయానకములు) ఆ ప్రధాన రసముల నుండి క్రమముగ ఉత్పన్నములనియు చెప్పెను. శృంగారము నుండి హాస్యము పుట్టెననుటలో ప్రాచీన భారతీయుల మనస్తత్త్వ శాస్త్ర పరిచితి విశదమగుచున్నది. శృంగారము 'రతి' అనెడి స్థాయి భావము నుండి పుట్టుచున్నది. 'రతి' యందు ఆనందము పరమావధిని అందుకొని మైమరపును కలిగించును. హాస్యమును జనింపజేయు స్థాయిభావము హాసము, అనగా నవ్వుట. నవ్వుట యందును ఆనందము పతాకస్థాయిని పొంది మైమరపును కలిగించును. మైమరపు అనునది రౌద్రము మొదలగువాని యందును కలుగుట సహజమే అయినను అందు ఆనందము మాత్రము ఉండదు.

హాస్యమునకు విభావాలను (కారణాలను) రూపజనితాలు, వేషజనితాలు, చేష్టా జనితాలు, వాగ్జనితాలు అని విభజింపవచ్చును. అనగా కొందరి రూపమే చూచువారికి నవ్వును పుట్టించును; కొందరు (సర్కసులోని హాస్యగాండ్లవలె) తమ వేషము వలన ఇతరులకు నవ్వు పుట్టింతురు; తమ చేష్టలవలననో, తమ మాటల వలననో మరికొందరు హాస్యమును కలుగజేయుదురు.

ఆత్మస్థము, పరస్థము అను రెండు రీతులుగ కూడ హాస్యమును వింగడింపవచ్చును. తనకు తానే నవ్వుకొనదగినది ఆత్మస్థ హాస్యము. ఇతరులకు నవ్వు పుట్టింపజేయునది పరస్థ హాస్యము. నవ్వు ఆరు విధాలని నాట్య శాస్త్రము చెప్పినది. అవి: 1. స్మితము 2. హసితము 3. విహసితము 4. ఉపహసితము 5. అపహసితము 6. అతిహసితము. వీనినే అచ్చ తెలుగులో చిరునవ్వు, నవ్వు, లోనవ్వు, వెకిలి నవ్వు, వెడనవ్వు, పకపక నవ్వు - అని చెప్పవచ్చును. వీనిలో మొదటి రెండు ఉత్తమ పాత్రలకు తగినవనియు, తక్కిన రెండు జంటలు క్రమముగ మధ్యమ, నీచ పాత్రలకు తగినవనియు భరతుని మతము.

ఇంతగా భరతుడు హాస్యాన్ని విశ్లేషణ చేసి వివరించినను, సంస్కృత నాటకాలలో హాస్యరస పోషణ అంతగా కన్పట్టదు. 'ప్రహసనము' అను రూపక భేదమును సంస్కృత సాహిత్య లక్షణవేత్తలు గుర్తించినను, ఆ ప్రహసనములలో కూడ, మనసునకు ఎడతెగని చిక్కని ఉల్లాసము కలిగించు హాస్యము కన్పడదు. ఈ లోపాన్ని ఎత్తిచూపుచు, చిలుకూరి నారాయణ రావు ఇటులనిరి: ''హాస్యరసము భారతీయ వాఙ్మయంలో మృగ్యము. వికారమైన అంగ వ్యాపార వర్ణనలోను, తిండిపోతుతనమును వర్ణించడంలోనూ, శీఘ్రముగా వెగటు పుట్టించే హాస్యము అక్కడక్కడ కనబడుతుంది. కాని, చల్లనిది, చిరునవ్వు పుట్టించి మనస్సును ఆనందపరచునది అయిన హాస్యము సంస్కృతములో వలెనే తెలుగుననూ కన్పడదు''.

సంస్కృత సాహిత్యములో హాస్యానికి గణనీయ స్థానము కల్పింపకపోవడానికి ఒక కారణమును మనము ఊహింపవచ్చును. ఆ సాహిత్యమున దృశ్య, శ్రవ్య కావ్యాలు రెండింట ఎక్కువగ శృంగార, వీరరసాలే ఆదరింపబడినవి. అందలి నాయకులు ధీరోదాత్తులు. అట్టివారిలో గంభీరత వెల్లివిరిసి ఉండగలదు. హాస్యానికి తావే ఉండదు. కరుణరసమునకు ప్రాముఖ్యమిచ్చిన చోట హాస్యమునకు సందర్భ శుద్ధియే ఉండదు. ఈ పరిస్థితిని గమనించియే స్త్రీ, నీచ ప్రకృతుల యందు హాస్యము అధికముగ కన్పట్టును అని భరతుడు స్పష్టీకరించెను. అయినను ఇందులకు అపవాదములుగ, ఏవైన కొన్ని రూపకాలు వచ్చి యుండెనా? అనుట పరిశోధింపదగిన విషయము. 12వ శతాబ్దివాడగు జయదేవుడు 'భాసో హాసః కవికులగురుః కాళిదాసో విలాసః' అని భాసమహాకవిని హాసమునకు పేరొందినవాడుగా ప్రశంసించెను. ప్రస్తుతమున మనకు ఉపలబ్ధమగు భాస నాటక చక్రమున అట్టి హాసమును కలిగించు హాస్య రచన ఎచటను కన్పడదు. అట్టి భాసుని రచన ఏదైన ఉండి అంతరించేనేమో! ప్రస్తుతమున దొరకు సంస్కృత నాటకములలో పల్లవ మహేంద్ర వర్మ (క్రీ.శ. 7వ శ.) రచించిన మత్తవిలాస ప్రహసనము వంటి కొన్నింటి యందు అటనట కొంత లలిత సుమధుర హాస్యము కనవచ్చుచున్నది.

ఆంధ్ర సాహిత్యము, 19వ శతాబ్ది మధ్య కాలము వరకు సంస్కృత సాహిత్యపు వరవడిలోనే నడచినది. కావున హాస్యమునకు తగిన స్థానము దానియందును లభింపలేదు. అయినను ఎడనెడ ఎడారులలోని ఊటబావులవలె కొన్ని గ్రంథాలలో కొన్ని హాస్య ఘట్టాలు చోటు చేసికొన్నవి. ఆంధ్ర సాహిత్య వృక్షానికి తొలుతటి ఫలముగ ప్రస్తుతమున లెక్కింపబడు ఆంధ్ర మహాభారతముననే ఇట్టివి కొన్ని ఉపలబ్ధాలు.

ఆదిపర్వము నందలి ఒక ఘట్టము: ద్రుపదుని బంధించి ద్రోణుని వద్దకు అర్జునుడు కొనివచ్చెను. అంతట ద్రుపదునితో ద్రోణుడు

''వీరెవ్వరయ్య ద్రుపద మ
హారాజులె యిట్లు కృపణులయి పట్టువడన్
వీరికి వలసెనె యహహా''

అని పరిహసించును. తన కసి తీర్చుకొంటినను ఆనందము ద్రోణునికి కలిగి నవ్వుగ పరిణమించినది. ఇది వాక్యజనితము అనగా మాటలవలన ఏర్పడిన హాస్యము. ఈ హాస్యపు అనుభూతి ద్రోణునికి మాత్రమే కలిగినది. ద్రుపదుని లజ్జ మాత్రమే లోగొనినది; చూచువారికి ద్రుపదుని స్థితి కరుణను కలిగించునది. ఇటుల ఆత్మస్థమగు హాస్యమునకు ఇది చక్కని లక్ష్యము.

ఇంకొక ఘట్టము ఆ పర్వమునందలిదే: ఏకచక్రపురమున బకాసురునికి ఒక దినపు ఆహారపు వంతుగ తమలో ఎవ్వరు పోదగునని ఒక బ్రాహ్మణ కుటుంబము నందలి వారలు వితర్కించుచు దుఃఖమున మునిగి యుండిరి. అపుడు

''బాలకుండొక కొండొక కోల చేతఁ
బట్టికొని యేన రక్కసుఁ గిట్టి చంపి
చులుకవత్తు మీరేడ్వఁగా వలవదనుచుఁ
గలయ నూరార్చెఁ దన తొక్కుఁ బలుకులొప్ప''

ఈ బాలకునివి అవ్యక్తపు తొక్కుపలుకులు. రాక్షసుని శక్తిని గురించి అతనికి ఏమియు తెలియదు. అతనిని చంపుటకు ఒక చిన్న కర్ర చాలునని ఆతని యోచన. అయినను ఆతని వీరాలాపాలు ఆ దుఃఖ వాతావరణంలో కొంతగ క్షణికముగనైన నవ్వును బుట్టించినవి. చుట్టు నున్నవారి ఏడ్పు తగ్గినది. ఏడుపులోనే లోలోన ఒక చిరునవ్వు. ఈ హాస్యము మాటలవలన, చేతల వలన పుట్టినది. ఆ మాటలనిన బాలకుడు ఈ హాస్యములో పాల్గొనడు. చుట్టునున్న వారలే కనులు తుడుచుకొనుచు లోలోన ఒక క్షణము నవ్వుకొందురు. ఇది పరస్థమగు లోనవ్వు (విహసితము).

తిక్కన రచనలో గూడ అక్కడక్కడ కొన్ని హాస్య ఘట్టాలు కలవు. వానినన్నిటిని ఇచట ఏకరువు పెట్టలేము. మచ్చునకు ఒకటి, రెండు.

చీకటిలో నర్తనశాలలోనికి చేరిన కీచకుడు, అచటికి అంతకు ముందుగనే వచ్చిచేరిన భీముని ద్రౌపదిగా భావించి, అతనిపై చేయిడి తన ప్రేమను, తన ఘనతను వెల్లడించగా, భీముడు అతనితో

తే. ...అకట నా పోల్కి యాడు
దాని వెదకియు నెయ్యెడనైన నీకుఁ
బడయవచ్చునె యెఱుఁగక పలికితిట్లు

క. నా యొడలు చేర్చినప్పుడ
నీ యొడలెట్లగునొ దాని నీవెఱిగెదు న
న్నే యబలల తోడిదిగాఁ
జేయఁ దలచితివి తప్పు సేసితి గంటే.

ఇందలి హాస్యము మాటల అమరిక వలన జనించినది. అందు శ్లేష అనగా రెండు అర్థములు స్ఫురించును. తన శరీరము కీచకుని శరీరమును తాకినపుడు వానికి మృత్యువు దాపురింపగల దని భీముని అభిప్రాయము. కీచకునికో లావణ్యరాశి యగు ద్రౌపది యొక్క శరీరముతో తన శరీరమునకు కలయిక లభించునని స్ఫురించును. ఇక పాఠకులు ఈ శ్లేషయందలి హాస్య రమణీయతకు ముగ్ధులై చిరునవ్వుల నెదజల్లుదురు. ఈ హాస్యానుభూతి, ఆ సంఘటనలో భాగస్వాములగు భీమునకుగాని, కీచకునికిగాని కలుగదు. పాఠకులకు కలుగును. ఇది అచ్చపు పరస్థమగు చిరునవ్వు.

ఇంకొక సంఘటన: ఉత్తరుడు యుద్ధమునకు సన్నద్ధుడై రథసారథి లేడని విచారించగ, బృహన్నల ఆ సారథ్యమునకు అంగీకరించును. అప్పుడు ఉత్తరుడు బృహన్నలకై ఒక కవచమును

''తెప్పించి తొడుగు మీవని
యొప్పించిన నిట్టునట్టు నొఱవలుగా మైఁ
గప్పికొని యా బృహన్నల
యప్పుడు నగుపించె నచటి యబలాజనమున్''

ఇచటి హాస్యము చేష్టల వలన కలిగినది. కవచమును తొడుగుకొను రీతిలో తొడుగుకొనక దుప్పటివలె పైన గప్పుకొనుట అచటి రాచకన్నెలకు నవ్వు కలిగించినది. ఇక పాఠకులను చేరునప్పటికి ఈ నవ్వు రెట్టింపగుచున్నది. వారికి తెలియును బృహన్నల అర్జునుడే యని. ఆ మహావీరునికి కవచ ధారణ వెన్నతో బెట్టిన విద్య. అట్టివాడు ఈ రీతిగ తెలియనివానివలె వ్యవహరించుటలోని అతని చమత్కృతియు, నిజమును గ్రహింపక నవ్విన అబలాజనముల అజ్ఞానమును పాఠకులకు హాస్యజనకాలగును. ఈ హాస్యమునందలి అనుభూతిలో అర్జునుడును, అబలాజనమును, పాఠకులును పాల్గొనుట వలన ఇది ఆత్మస్థము, పరస్థమునగునది.

శృంగారమునకును భక్తికిని కొంత చుట్టరికము గలదని జయదేవుడు మొదలగు రచయితల అభిప్రాయము. అందువలననే కాబోలు భక్తిభావ నిధానమగు ఆంధ్రమహాభాగవతమున పోతనామాత్యుడు అటనట శృంగార రసముతో సన్నిహితమని సంభావితమగు, చక్కని హాస్యరసమును వర్ణించెను. ముఖ్యముగ కృష్ణలీలల వర్ణనలో లలితహాస్యము కొంత ద్యోతకమగును.

బాలకృష్ణుడు తాను వెన్నదొంగను కానని తన తల్లితో అనును. కాని కడకు దొంగగ పట్టువడును. అప్పుడు ఆ తల్లి కృష్ణునితో

''వీరెవ్వరు శ్రీకృష్ణులు
గారా! యెన్నడును వెన్నగానరట కదా
చోరత్వం బించుకయును
నేరరట, ధరిత్రి నిట్టి నియతులుఁ గలరే!''

తల్లిప్రేమతో రంగరించిన అధిక్షేపము (ఎత్తిపొడుపు) ఇందు చక్కని తెలుగు నుడికారమున పొందుపరుపబడి, హాస్యరసమును పాఠకుల హృదయాలలో వెల్లివిరియజేయు ఘట్టమిది.

శ్రీనాథుని రచనలలో కూడ వాక్చమత్కృతిని, సామెతలను ఆధారముగ చేసికొనిన హాస్యము కనబడును. అతని శృంగార నైషధములోని పెండ్లి విందున హాస్యము కొంత మొరటుగా ఉండును. ఇక తరువాతి కాలమున గౌరన, నంది తిమ్మన, పింగళి సూరన, చేమకూర వెంకటకవి హాస్యాన్ని కొంతవరకు పోషించిరి.

కావ్యముల సంగతి ఎటులున్నను ఆంధ్ర కవుల చాటువులలో కొన్నింట హాస్యరసము వెల్లివిరిసినదని చెప్పవచ్చును. ఈ విషయమున శ్రీనాథునికే ఎక్కువ ప్రశస్తి లభించినది. రూపమును చేష్టలను ఆధారముగ గ్రహించి చిత్తరువును గీచినటుల అతడొక బాలికను ఈవిధముగ వర్ణించి మనల నవ్వించును.

''మేతఁ గరిపిల్ల, పోరున మేకపిల్ల
పారుబోతుతనంబునఁ బందిపిల్ల
ఎల్లపనులను జెరుపంగఁ బిల్లిపిల్ల
అందమునఁ గ్రోతిపిల్ల యీ అరవపిల్ల.

ఆంధ్రదేశమున వియ్యపువారల మధ్య హాస్య ప్రసంగాలు తరచుగ వినబడుచుండును. శ్రీనాథునికి కలిదిండి రామయ అను బావమరది ఉండెడివాడు. అతడు తన కొడుకు తెలివితేటలను గొప్పగా చెప్పుకొని, అతడు అచ్చముగ తనవంటివాడే అని అనెడువాడు. అందులకై శ్రీనాథుడు అతనికి ఒక వెచ్చని చురకను ఈవిధముగ అంటించి, హాస్యరసాన్ని ఒలికించెను.

మా కలిదిండి రామయ కుమారకుఁ డన్నిటఁ దండ్రి పోలికే
కాక తదన్యుడెట్లగును గాడిదకున్ దురగంబు పుట్టునే
చేకొని కొంకినక్కకును సింగము పుట్టునె మాలకాకికిన్
గోకిల బుట్టునే చిరుతకుక్కయు మత్తగజంబునీనునే!

తెలుగుదేశపు తోలుబొమ్మలాటలలోని హాస్యాన్ని కేతిగాడు (గంధోళిగాడు), బంగారక్క గుత్తకు గ్రహించి విశ్వఖ్యాతిని ఆర్జించినను వీరిది చాలవరకు హద్దులను మించిన మొరటు హాస్యము. దక్షిణాంధ్ర యుగపు యక్షగానాలలోను కనబడునది ఇట్టి హాస్యమే. ఏదో విధమగు 'బూతు' లేనిదే హాస్యమున చక్కని తాలింపు ఉండదని భావించిన రోజులవి. ఆ కాలపువాడే యైన కవి చౌడప్ప.

'బూతాడక దొరకు నవ్వు పుట్టదు ధరలో'

అని హాస్యపు మూల రహస్యమును సూత్రీకరించినటుల భావించెను.

ఒక తెలుగుదేశముననే కాదు, అన్ని దేశాలలోను హాస్యాన్ని బూతుతో అనుసంధించుట సాధారణ ప్రసంగాలలో కన్పడుచున్నది. శృంగారమునకు హాస్యానికి ఉన్న సన్నిహిత సంబంధమే దీనికి కారణమై ఉండవచ్చును. శృంగారమును భక్తితో మేళవించిన రచయితలు ఈవిధపు హాస్యానికి కొంత ప్రశస్తిని కల్పించిరి. భగవద్భక్తికీ, ఇట్టి బూతునకు ఉన్న సంబంధమునే తాతాజీ (తాపీ ధర్మారావు) తన 'దేవాలయాలపై బూతు బొమ్మలు' అనే గ్రంథములో చక్కగ విశ్లేషించెను. కాని తాతాజీకి పూర్వము చాలకాలము క్రిందటనే ఒక తెలుగుకవి, కూచిమంచి జగ్గన, ఈ విషయమున మార్గదర్శియై

'ధరాతల మంతటి లోనఁ బూతులం బూర్ణుఁడ' అని తనను తాను ప్రశంసించుకొని, బూతులకు గల అగ్రస్థానాన్ని స్పష్టీకరించెను. ఈ పద్యపాదములో, రెండర్థములు స్ఫురించును. అందువలన బూతులకు, పూతులకు (పవిత్రులకు) మధ్య విభేదమే లేదని ఆయన వెల్లడించెను. ఈ పద్యము అతని 'చంద్రరేఖా విలాపము' లోనిది. ఆ గ్రంథపు మొరటు బూతుల హాస్యమునకు తట్టుకొనలేని ప్రభుత్వము ఆ గ్రంథపు ముద్రణనే నిషేధించినది.

తెలుగుదేశపు పండితులకు ఆంగ్ల సాహిత్యముతో పరిచయము ఏర్పడిన తరువాత హాస్య రచన ఒక క్రొత్త మార్గమును అనుసరించినది. ఆంగ్ల సాహిత్యమున వాక్చమత్కృతికి హాస్యమున (Wit and Humour) కు ఆదరణ మెండు. ఆ పంథాను అనుసరించి కందుకూరి వీరేశలింగం పంతులు, తన 'సత్యరాజాపూర్వ తీర్థయాత్రలు' రచించెను. సంఘమునందలి దోషములను, ముఖ్యముగ స్త్రీల యెడల పురుషులు పాటించెడు నైచ్య భావాన్ని దుయ్యబట్టుటకు ఆయన హాస్యాన్ని చక్కగ వినియోగించెను. చిలకమర్తి వారి నవలలో కననగునది లలిత హాస్యము. తరువాతి వారిలో గురజాడ, వేదము వెంకటరాయశాస్త్రి, మొక్కపాటి, భమిడి

పాటి, మునిమాణిక్యం, పానుగంటి హాస్యానికి ఆలంబనాలై క్రొంగ్రొత్తదనాన్ని దానికి కల్పించిరి. భాషా సాంకర్యము వలన ఒక విధపు హాస్యాన్ని రూపొందించవచ్చునని రుజువు చేసినవారు వీరిలో తొలుతటి ఇరువురు. ఇంగ్లీషు-తెలుగు సాంకర్యమును గురజాడ కన్యాశుల్కము ఆదరించగా, వేదమువారు తన ప్రతాపరుద్రీయములో తెలుగు-ఉర్దూల కలయికను హాస్యానికై అభిమానించెను. మొక్కపాటివారి బారిష్టరు పార్వతీశం ఒక విశిష్ట వ్యక్తి. ఆతని సహజపు అమాయికపు చేష్టలు చదువరులను హాస్యరసాన ఓలలాడించును. మాటల చమత్కృతి, చేతల వికృతి అందు కలగలుపై, పాఠకులను గిలిగింతలు పెట్టును. పానుగంటి లోని హాస్యప్రజ్ఞ పాఠకుని ఒక నూత్న ప్రపంచములోనికే కొనిపోయి మైమరపించును. హాస్యమునకు వస్తువు గానిది ఏదియు లేదను రీతిలో ఆతని రచన సాగినది. దొంతులు దొంతులుగ మాటలను వాక్యాలను పేర్చి కూర్చి హాస్య సౌధానికి సోపానాలు నిర్మించగలిగిన దిట్ట పానుగంటి. మచ్చునకు:

''గ్రంథారిగాఁడు దివ్యమంగళ స్వరూపుడై తెర నలంకరించినాడు. సభాజన ముఖముల నలరించినాడు. చంద్రునిఁ జూచిన కలువవనమువలె సభ కలకలలాడుచున్నది. ఓ, ఎక్కడ జూచిన నవ్వులే... జగదానందమూర్తియగు నా పురుషోత్తముని కొరకే! కాని యెడల నిన్ని చింపితలలెవని కొరకు? ఇన్ని జాలుపైటలెవని కొరకు, ఇన్ని కప్పుపండ్లెవరి కొరకు; ఇన్ని నంక కొప్పులెవరి కొరకు, ఇన్ని పూల గాగరాలెవని కొరకు... నోరు తెరచి బాధాకరపు జూపులతో బాలవితంతువులు పరిశీలించుచున్నారు, ముగ్ధాంగనలు తలలట్టె వంచుకొని పై రెప్పల పైనుంచి చూచుచున్నారు...''

గద్యముననే కాదు, పద్యమున సైతము హాస్యము ఈ కాలమున వెలసినది. కృష్ణశాస్త్రి, జాషువా, బోయి భీమన్న మొదలగువారు ఆ రంగమున కొంత గణనీయ కృషి సాగించిరి.

ఈ యుగముననే హాస్య రస పోషణలో కొంతగ పాల్గొని ప్రసిద్ధిని ఆర్జించిన నాడు ముద్రారాక్షసుడు. అచ్చుపీసుల ద్వారా ఆయన సృజించిన హాస్య ప్రపంచము అత్యంత రమణీయము. కాళేశ్వరరావుగారు ఒకపుడు ఒక సభలో ప్రసంగించిరి. దానిని ఒక పత్రిక ''నందిగామలో శ్రీ కాళేశ్వరరావుగారు వేయిమంది గల బహిరంగ సభలో ప్రసవించిరి'' అని అచ్చున రూపొందించినది, రావుగారి ప్రసంగానికి చిరస్థాయితను కల్పించినది ఈవిధముగ ప్రసవించిన హాస్యరసము.

ఈ రకానికి చెందిననే పనుల వ్యత్యస్తత, మాటల తారుమారు. పోస్టుబాక్సు వద్దకు వెళ్లి పేనాను బాక్సులో వేసి, కార్డును జేబులో పెట్టుకొనుట పనుల వ్యత్యస్తతకు ఉదాహరణము. దీనిని ఆంగ్లమున 'స్పూనరిజమ్' అని వ్యవహరించెదరు. పాశ్చాత్యులలో వీడ్కోలు సమయమున యాత్రికుడు భార్య మొగమున ముద్దిడి, జవానునకు ఇనాము ఇచ్చుట పరిపాటి. కాని స్పూనరు దొరగారికి పరధ్యానము ఎక్కువ; అందువలన ఆ సమయాన జవాను మొగమున ముద్దిడి, భార్యకు ఇనామును ప్రసాదించి, స్పూనరిజానికి రూపకల్పన చేసెను. 'కీర్తిశేషుడు వీరయ్య' అని పలుకబోయి సభాకంపము వలన 'కీర్తివీరుడు శేషయ్య' అనుట మాటల తారుమారుకు చక్కని లక్ష్యము.

హాస్యము జీవితమున అంధకారమును తొలగించు చల్లని వెన్నెల వంటిది. కాని ఇది క్రమక్రమముగా మన సమాజమున అంతరించిపోవుచున్నది. కారణము సువేద్యము. ప్రభుత్వ

పంచవర్ష ప్రణాళికలు సంఖ్యాక్రమంలో ముందునకు సాగినకొలది సగటు పౌరుని జీవితమున సుఖము క్రమేణ సన్నగిల్లుచున్నది. అసంతృప్తి, ఆవేదన ఎల్లెడల అలముకొనుచున్నవి. ఈ పరిస్థితి కవితలో రచనలో కూడ ప్రతిఫలించినది. దాని ఫలితముగ కొందరు కృష్ణశాస్త్రి గారి గీతాన్ని అరువు తెచ్చుకొని 'మీరు మనసారగా నేడ్వనీరు నన్ను' అను ఫణితిని ఆదరించగ, కొందరు 'ఆకలిచేత మలమల మాడే అనాథ లందరు లేవండోయ్' అని గర్జించుచున్నారు. ఈ ఏడుపుల సందడిలో, గర్జనల రణగొణ ధ్వనిలో ఆదరించువారు లేక అల్లాడి సన్నగిలినది హాస్యము. కాని ఈ దుస్థితిలో, దానిని ఆదరించి పరిపోషించి, కాపాడు భారాన్ని తమపైన వేసికొని కొందరు రాజకీయ నాయకులు వ్యవహరించుచున్నందు లకు వారికి దేశము ఎంతగనో ఋణపడి యున్నది.

ఇట్టి రాజకీయ నాయకులు పూర్వపు స్వాతంత్ర్య సంగ్రామపు కాలపు వారు కారు; ఆ తరము అంతరించినది. వారికి వీరికి మధ్య ఎంతో భేదము. పూర్వపువారికి ఆలంబనము మహాత్మగాంధి; ఈ తరపువారికి ఆలంబనము అధికార రంధి. వీరి హాస్యప్రియత్వానికి మెరుగుపెట్టుచున్నది వీరి ఆంగ్లభాషాపదముల తప్పుడు ప్రయోగము. ఇట్టి వారు ఈనాడు వందల కొలదిగ ఉన్నారు. వారి హాస్యరసమయ సూక్తులు సహస్రాధికాలు. ఒక డాక్టరేట్ నకై సిద్ధాంత వ్యాసమును తయారుచేయ వీలగునంతగ పెరిగినది ఆ వాఙ్మయము. మచ్చునకు ఒక సంఘటన.

ఒక న్యాయస్థాన భవనాన్ని ఒక మంత్రిగారు ఆవిష్కరించుచు "I hope that this Court, would dispense with Justice without fear or favour" అని అన్నారు. ఆంగ్లమున క్రియకు ఉపసర్గల చేరికవలన అర్థములు మారును. ఆ భాషలో డిస్పెన్స్ జస్టిస్ (dispense Justice) అనగా 'న్యాయమును ప్రసాదించుట'; డిస్పెన్స్ విత్ జస్టిస్ (dispense with Justice) అనగా 'న్యాయమును పరిహరించుట'. మంత్రిగారు మొదటి దానిని భావించి, రెండవ దానిని వాడి, న్యాయాన్ని సాగనంపినను, హాస్యాన్ని మాత్రము పోషించి పుణ్యము ఆర్జించిరి.

ఇట్టి నాయకులను ఆశ్రయించి వారిని కీర్తించి వారి ప్రతిభా పాటవాలను గోరంతలు కొండంతలుగ చిత్రించు కవిపండితులును కలరు. వారిని వీరు పొగడగా, వీరిని వారు సన్మానించి, పెద్దజేసి పైకి లాగుదురు. ఇట్టి వారిని దృష్టిలో ఉంచుకొనియే ఒక కవి వ్రాసినది ఈ దిగువ సీసము :

కోణంగి నాట్యముల్ క్రోతులాడించగా
    నూరబందులు సభనున్న యట్లు
గూబకూతలు విని గువ్వలు తలలూచి
    పోయి కాకులవద్ద బొగడినట్లు
కాలువదరి నుండి కప్ప లంఘించగా
    నెండ్రకాయలు తలలెత్తినట్లు
ఎనుబోతు బిరుదులు మనుబోతు పొగడగ
    మేలు మేలని గొఱ్ఱె మెచ్చినట్లు
ఓగు దగిడీలు తమ లోన నొకరినొకరు
    మెచ్చుకొనుచుందురు ...

# కల్పనకు హద్దులు

– కొడవటిగంటి కుటుంబరావు

కాల్పనిక సాహిత్యానికీనాడు అనన్య ప్రచారం ఉంటున్నది. ఈ సాహిత్యం కళాత్మకంగా ఉండాలంటే ఏయే నియమాలు పాటించాలో, అభ్యుదయ దృక్పథం సాగాలంటే దానికి ఏయే లక్షణాలుండాలో గొప్ప గొప్ప విమర్శకులు చెబుతూనే వస్తున్నారు. అనేక సిద్ధాంతాలను గురించి తర్జన భర్జనలు కూడా జరుగుతున్నాయి. కొన్ని సిద్ధాంతాలకు కాలదోషం పట్టుతున్నది. కొన్ని కొత్తవి పుట్టుకొస్తున్నాయి. ఉదాహరణకు సోషలిస్టు రియాలిజం తీసుకోవచ్చు. కీ॥ శే॥ అవసరాల సూర్యారావు ఒకప్పుడు నాకు ఉత్తరం రాస్తూ తన కథలలో సోషలిస్టు వాస్తవికత ఉన్నదనీ, వర్గ సమాజ చిత్రణలో కూడా సోషలిస్టు వాస్తవికత ఉండవచ్చుననీ రాశాడు. కాబోలు అనుకున్నాను. తరవాత ఇల్యా ఎహ్రెన్‌బూర్గ్ మద్రాసు వచ్చినప్పుడు సోషలిస్టు వాస్తవికత గురించి ఆయన అభిప్రాయాన్ని అడిగితే, ''సోషలిజం అంటే స్పష్టంగానే ఉన్నది; వాస్తవికత అన్నది కూడా స్పష్టంగానే ఉన్నది; కాని సోషలిస్టు వాస్తవికత అన్నది కొంచెం అస్పష్టంగా ఉన్నది,'' అన్నాడు. మరికొంత కాలం గడిచాక విదేశాల వాళ్లెవరో బరీస్ పోలెవోయ్‌ని రష్యాలో ఇటువంటి ప్రశ్నే వేస్తే ఆయన నవ్వి ''దాని అర్థం ముందుకు చూడమని!'' అనేశాడు.

ఇదేవిధంగా ''పాజిటివ్ హీరో,'' నెగెటివ్ హీరో'' గురించి తర్జన భర్జనలు జరిగాయి.

నేనిక్కడ అలాంటి సమస్యల జోలికి పోను. నేను వర్తమాన సాహిత్యం చదివేటప్పుడు మన కథకులు కొందరు కల్పన చేసేటప్పుడు కొంచెం హద్దుమీరి పోతున్నారేమో ననిపిస్తూ ఉంటుంది. కల్పనకు కొన్ని హద్దులుండటం తప్పనిసరి అని కూడా నాకు తోస్తుంది. అందుచేత ఆ హద్దులను వివరించటానికి ప్రయత్నిస్తాను. నేను సూచించే హద్దులు ఏ కళా సూత్రాలకు గాని వ్యతిరేకంగా పరిణమించే పక్షంలో లోపం నేను హద్దులనే వాటిలోనైనా ఉండాలి. కళా సిద్ధాంతంలోనైనా ఉండాలి.

కొందరు రచయితలు పాఠకుల హృదయాలను స్పందింప జెయ్యటానికీ, ద్రవింప జెయ్యటానికీ, చలింప జెయ్యటానికీ, ఉద్రూత లూగించటానికీ శ్రమ పడతారు. ఇటువంటి ప్రయత్నంమీద నిషేధం ఏదీ ఉండనవసరం లేదు, నిజానికి జీవితం చాలా హృదయ విదారకంగానే ఉంటున్నది. జీవితం చూసి గుండె పగిలిపోకుండా ఉండటానికి మనం ఎన్నో రక్షణలు కల్పించుకున్నాం, ఎన్నో స్వార్థపు గోడలను ఆసరా చేసుకున్నాం. ఎవతెనన్నా మొగుడు చావగొట్టుతుంటే. ''అదేం చేసిందో?'' అనుకుని సమాధానపడతాం. ఎవడన్నా బిచ్చగాడు కనిపిస్తే ''వెధవలు, వీళ్ళ దగ్గర డబ్బు మూలుగుతూ ఉంటుందిట''. అను కుంటాం. మన కళ్ళ ఎదుట హత్య జరిగిపోతూంటే, ''మనం ఇందులో ఇరుక్కున్నామంటే పీక్కోలేక చావాలి,'' అనుకుంటాం. పూర్వజన్మ పాప ఫలితాలూ, కర్మ సిద్ధాంతాలూ లాంటి

నల్లమందు ఉండనే ఉన్నది. ఈ హృదయ విదారక సంఘటనలే కథల్లో చదివి మనని మనం ఇలా రక్షించుకోలేం. నిష్కారణంగా పెళ్లాన్ని చావగొట్టే భర్తనూ, రెండు రోజులుగా తిండిలేని పేదవాణ్ణి కథకుడు మనకు చూపగలడు. డికెన్సు తన నవలల్లో చిత్రించిన జీవితానికి చలించని వాళ్ళు, అతని నవలలకు చలించి ఉంటే అందులో ఆశ్చర్యపడటానికి ఏమీ లేదు.

కాని పాఠకుడి గుండెను పిండటానికి కొన్ని హద్దులున్నాయంటాను. ''దైవికంగా'' జరిగే సంఘటనలతో పాఠకుణ్ణి రాచి రంపాన పెట్టటం చాలా దారుణం. నిత్యజీవితంలో మనుషులకు విధి వక్రించి ఎన్నో అగచాట్లు వస్తాయి. ఒకాయనకు రెండేళ్ళ కాలంలో ఉన్న పిల్లలందరూ పోతారు. నలుగురు పసిపిల్లలను దిక్కులేకుండా వదిలి తల్లీ తండ్రీ ఒక్కసారే పోతారు. వరదలు వస్తాయి. వంగుళ్ళు వస్తాయి. రైలు ప్రమాదాలు జరుగుతాయి. విమానాలు కూలిపోతాయి. ఇలాంటి కష్టాలన్నీ ఒక వ్యక్తికి జరిగినట్టే కథ చదవవలసివస్తే గుండె తరుక్కుపోతుంది. కాని ఆ కష్టాలను కథ రూపంలో చదవటంవల్ల ప్రయోజనం ఏమన్నా ఉంటుందా? ఏమీ ఉండదు. అందులో సామాజిక చిత్రణ ఏమీ ఉండదు.

సమాజంలోనూ, సమాజంతోనూ మనిషి పడే ఘర్షణ మన హృదయాలను చలింపజేస్తే ఆ చైతన్యంవల్ల ప్రయోజనం ఉన్నది.

చిత్ర మేమిటంటే, సామాజిక చిత్రణ ఉండదగిన సన్నివేశాలను తీసుకుని కూడా వాటిని దైవికంగా చిత్రించే వాళ్లున్నారు. ఈనాటి మన సమాజంలో దారిద్ర్యమూ, ఆకలీ, నిరుద్యోగమూ వగైరాలు కృత్రిమమైనవి. ఆడపిల్లల తల్లిదండ్రులు అల్లుళ్ళకు కట్నాలు పొయ్యలేక పోవటమూ, రాక్షసులలాంటి భర్తలతో భార్యలు తప్పనిసరిగా నరకయాతనలనుభవించడమూ మొదలైనవి జీవితంలో ఎంత వాస్తవ సమస్యలుగా ఉన్నా , అవి కృత్రిమమైనవే! వాటికి పరిష్కార మార్గాలున్నాయి. ఆ మార్గాలను అనుసరించకపోవటం ఆయా వ్యక్తుల బలహీనత; సమాజంలో విధిగా రావలసిన మార్పుల కోసం పాటుపడని వాళ్ళ తప్పు. ఇలాంటి కుళ్ళును దైవికంగానూ, అనివార్యంగానూ చిత్రించి హృదయాలను సంచలింపజేస్తే అందువల్ల సమాజం మారుతుందనేది కల్ల. దుర్భరమైన జీవిత సమస్యలకింద నలిగేవాళ్లు చాలామంది జీవితంలో ఉన్నారు. కథలు చిత్రించవలసినది వాళ్ళను కాదు, ఆ సమస్యలను పరిష్కరించటానికి ప్రయత్నించే వాళ్ళని. వాళ్ళ ప్రయత్నాలు శిష్ట సమ్మతం కాకపోవచ్చు; అమలులో ఉన్న సంఘ నియమాలకు విరుద్ధం కావచ్చు. కాని అటువంటి చిత్రణవల్ల కొంత ప్రయోజనం ఉన్నది. చలంగారు అచ్చుగా ప్రేమ రహితమైన స్త్రీ జీవితాలను చిత్రించి తృప్తిపడలేదు; ప్రేమాన్వేషణలో స్త్రీలను ఇంటినుంచి బయటికి పంపాడు. వర్తమాన జీవితంలో స్త్రీకి ప్రేమమయ జీవితం ఉండాలనేది ముఖ్య సమస్య అనుకుంటే - చాలామంది ఆ రోజుల్లో అనుకున్నారు - చలంగారు రాసినది సరిఅయినదే. ఎలాగూ బతకలేనివాడు దొంగతనం చేస్తే, లేక చేసినట్టు కథ రాస్తే, ఈనాడు పాఠకుడు వాణ్ణి ఎలా తప్పు పడతాడు? జూదంలో పెళ్ళాన్ని పణంగా పెట్టిన ధర్మరాజుకన్నా ఈ దొంగ తక్కువ వాడవుతాడా? నిజమే. వాస్తవ జీవితంలో దొంగకు శిక్షపడుతుంది. వాస్తవ జీవితంలో ఉన్న అవతవక చట్టాలను సమర్థించటానికే అయితే కథలు రాయాలా?

వితంతు వివాహాలు అమలులోకివచ్చి, విడాకుల ఏర్పాటుకు ప్రయత్నాలు ఏమీ లేని రోజుల్లో కీ.శే. శ్రీనివాస శిరోమణి ఒక కథ రాశాడు. ఒక యువకుడు ఏ కారణంచేతనో తన మొదటి భార్యను విడిచిపెట్టి మరొక భార్యను చేసుకుంటాడు. మొదటి భార్య

పునర్వివాహం చేసుకునే మార్గం లేదు. హీరో వెళ్ళి ఆమె భర్తను హత్యచేస్తాడు. ఒక్కసారే ఇద్దరు భార్యలూ వితంతువులవుతారు; ఇద్దరూ ఇప్పుడు పెళ్ళాడవచ్చు. ఇది గొప్ప కథ అని చెప్పడం లేదు. కాని అది ఒక సాంఘిక స్థితిని నగ్నంగా చూపింది.

మన కథలలో మరొక ధోరణి కూడా కనబడుతుంది. అవి ఆధ్యాత్మిక విలువలు. బంకించంద్రుడి నవలల్లో అతీత వ్యక్తులు వచ్చి లౌకిక విషయాలలో పాల్గొంటారు. మన కథల్లో హీరోలు లౌకిక విషయాల నుంచి తెంచుకొని దేవుడి బిడ్డలైపోయి, హంసల్లాగా ఆకాశానికి ఎగిరి, మనబోటి మానవులకు అందకుండా పోతారు. వారికి సత్యం భూమిమీద కనబడదు, ఆకాశంలో కనిపిస్తుంది. భగవంతుడు (ఏ వెంకటేశ్వరుడి రూపంలోనో) వాళ్ళకు ప్రత్యేకమైన దాఖలాలూ, సదుపాయాలూ ఇచ్చి ఆదరిస్తాడు. ఈ కథలూ, నవలలూ చదివి మనం కుళ్ళులో జీవించే పురుగుల మనుకోవాలన్న మాట!

ఇలాంటి రచనలు హద్దుమీరిన రచనలు, వాస్తవ జీవితంలో ఆధ్యాత్మిక విలువకు అంకితమై పోయినవాళ్ళు ఎందరైనా ఉండవచ్చు. వాళ్లు ఈ మన జీవితానికి చిన్న మెత్తు ఉపకారం చెయ్యలేరు. వారి ఆధ్యాత్మిక విలువలు మన భౌతిక సామాజిక విలువలను మార్చే మార్గం ఉంటే వాటిని గురించి ఆలోచించవచ్చు. లేనిపక్షంలో భగవద్భక్తినీ, మత విశ్వాసాలనూ ప్రబోధించే పుస్తకాలు కొల్లలుగా ఉన్నాయి. అవి చెయ్యలేని పని ఆధునిక నవలలు చెయ్యడం చాలా అనుమానాస్పదం.

అంతకంటె ముఖ్యమైన విషయమేమిటంటే, ఈ నవలలు జీవితాన్ని గురించి అబద్ధాలు రాస్తాయి. హేతువాదంతో అర్థం కాదగిన వాటికి విపరీతార్థాలు కల్పిస్తాయి. హేతువాదంతో తేలికగా అర్థంకాని విషయాలకు జీవితంలో అనవసర ప్రాముఖ్యం ఇస్తాయి. నిత్యజీవితంలో మానవ ప్రయత్నాన్ని మంట గలుపుతాయి.

ఈనాటి రచయితలు వేరువేరు తాత్విక దృక్పథాలనూ, సామాజిక శాస్త్రాలనూ అలవరచుకుంటున్నారు. వ్యక్తికీ, సమాజానికీ, భావనకూ సంబంధించిన అనేక సిద్ధాంతాలు చలామణిలో ఉన్నాయి. శక్తికొద్దీ దోపిడి (పెట్టుబడిదారీ) వాదమూ, సోషలిజమూ, కమ్యూనిజమూ, ప్రజాస్వామ్యవాదమూ, ఫ్రాయిడ్ సిద్ధాంతాలూ, యుంగ్ సిద్ధాంతాలూ, అద్వైతమూ, భౌతికవాదమూ, ఎగ్జిస్టెన్షియలిజమూ, ఇంకా సవాలక్షవాదాలు రకరకాల వ్యక్తులను వేరువేరు కారణాలవల్ల ఆకర్షిస్తున్నాయి. వారిలో రచయితలు కూడా ఉన్నారు. వీళ్ళు జీవితాన్నీ, జీవిత గమనాన్నీ తమ తమ దృక్పథాల నుంచి అర్థం చేసుకునేటందుకే ప్రయత్నిస్తారు. వారికి ఆ స్వేచ్ఛ ఉన్నదని ఒప్పుకోవచ్చు.

కాని ఈ రచయితలు తమ సిద్ధాంతాలకు అనుగుణంగా ఉండేటట్టు జీవితాన్ని కృత్రిమంగా చిత్రించటం హద్దుమీరటమే అనిపించుకుంటుంది. పాశ్చాత్య సాహిత్యంలో స్కిజోఫ్రినియా, పారనోయియా, డిప్సొమానియా వగైరా మానసిక రోగ చిత్రణను కథల రూపంలో రచించటం పరిపాటిగా ఉంటున్నది. అవి కృత్రిమ చిత్రణలు కావు. కాని వాటివల్ల ప్రయోజనం ఏమిటి?

కూరలో ఉప్పు ఎక్కువయితే నోట్లో పెట్టుకోలేనివాడు జగత్తు మిథ్య అన్న పరమసత్యాన్ని ప్రచారం చెయ్యటంలో అర్థమేమిటి? బాంకులను జాతీయం చేయటం కమ్యూనిజమనేవాళ్ళు సోషలిజం తెస్తామన్నట్టు!

మన సమాజం దేవుణ్ణీ, విధినీ ఏనాడో నిరాకరించింది. మానవుడి చర్యలను శాసించే శాసనాలు చేసి, వాటిని అతిక్రమించిన వాణ్ణి సమాజం శిక్షిస్తున్నది. అలాంటప్పుడు ఈశ్వరుడే అన్నీ చేస్తున్నాడు లేక చేయిస్తున్నాడనటంలో అర్థమేమిటి? నేరాలు చేసిన వాణ్ణి సమాజం వాడి ''కర్మకు'' వదలదెందుచేత? కర్మ సిద్ధాంతం ఏమై పోతున్నది?

ఒక కోటీశ్వరుడు ఒక దిక్కులేని పిల్లకోసం అష్టకష్టాలు పడ్డట్టు కథ రాస్తే నమ్మి నిజమనుకునే వాళ్లు ఉంటారా?

ఒక రచయిత కమ్యూనిజంలో విశ్వాసం ఉండి, మనదేశానికి కమ్యూనిజం వచ్చేసినట్టు రాస్తే ఎవరూ ఆమోదించక పోవటం సబబే గదా!

ఈ విషయాలన్నీ చెప్పటంలో నేను రెండు నమ్మకాలకు కట్టుబడ్డాను. ఒకటి సాహిత్యానికి సాంఘిక ప్రయోజనం ఉండాలన్నది; రెండోది జీవిత చిత్రణ వాస్తవికంగా ఉండాలన్నది.

ఈ విశ్వాసాలు కళాకారులందరికీ ఉండవనీ, ప్రచ్ఛన్న కమ్యూనిస్టులై ఉండి, అభ్యుదయ రచయితలమని ముద్ర వేసుకునే వాళ్ళకే ఉంటాయని వాదించినవారున్నారు. వాళ్ళ వాదనలు అట్టే వినగా నాకు ఒక సంగతి తెలియవచ్చింది. అదేమిటంటే, వాళ్ళకూ సాహిత్యం ద్వారా సాంఘిక ప్రయోజనం కావాలి; అవాస్తవ రచనలను వాళ్ళూ సహించరు. వాళ్ళ అభ్యంతరమల్లా సాంఘికాభ్యుదయం గురించే. ★

రచయిత షష్టిపూర్తి సందర్భంలో వ్రాసిన వ్యాసం – పునర్ముద్రణ

## MODERN CIVILISATION

In the twentieth century, live largely in what can be described as an I-centred, or now-centred, culture. It is what Christopher Lasch and others have called a narcissistic culture. It is a culture which stresses the importance of 'I' and 'mine'. The individual, his experiences, his feelings, his 'happiness' are the focus of attention, truth and value.

– **Danah Zohar.**

Printed, Published and Edited by ALAPATI RAVINDRANATH for and at Kala Jyothi Process Pvt. Ltd., 1-1-60/5, Iftekar Mansion Lane, R.T.C. X Roads, Musheerabad, Hyd-20. Ph. 612436, 612337.

**Editorial NEST**

Plot No. 337 A, Road No. 10, Jubilee Hills, Hyderabad-500 034. Ph. 247717